341



సాహిత్య మాసపత్రిక

# స్రవంతి

* సోమ సుందర్
* వాసాల నరసయ్య
* మంత్రప్రెగడ వీరభద్రమూర్తి
* సాంఖ్యశ్రీ
* ముదివేడు ప్రభాకరశాస్త్రి
* సుభామ
* మల్లాది రామచంద్ర శా
* డాక్టర్ సుమనశ్రీ
* రఘువర్మ
* తూమాటి దోణప్ప
* యన్. యస్. రాజు



ది. 6.6-82న గుంటూరు పట్టణ హిందీ ప్రేమీమండలివారు ఏర్పాటు చేసిన ప్రమాణపత్ర వితరణోత్సవ సభ సందర్భంలో తీయబడిన చాయాచిత్రం. చిత్రంలో శ్రీ చిర్రావూరి సుబ్రహ్మణ్యం, ప్రేమీమండలి అధ్యక్షులు శ్రీ గుడివాడ పుల్లారావు, కార్యదర్శి శ్రీ చి. కుసుమ హరనాథశర్మ, ప్రిన్సిపాల్ శ్రీ చావలి కోటేశ్వరరావు, ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి అధ్యక్షులు శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు ఉన్నారు.



దక్షిణ భారత హిందీ ప్రచార సభ- ఆంధ్ర, విజయవాడ హిందీ ప్రచారక విద్యాలయం ఆవరణలో నిర్మిస్తున్న హాస్టల్ భవన నిర్మాణానికి విజయవాడలో ప్రముఖ హిందీ ప్రచారిక శ్రీమతి మద్దాలి అనసూయగారు రు. 1000/- విరాళము నొసగియున్నారు. ది 4-5-1982న జరిగిన సమావేశంలో అనసూయగారు కేంద్ర సభ ద్వితీయ ఉపాధ్యక్షులు శ్రీ ఎ. పి. సి. వీరబాహుగారికి విరాళపు సొమ్ము అందజేయు చిత్రం.




సాహిత్య మాస పత్రిక

# 341

అగస్టు 1982

సంపుటి : 30, సంచిక : 3

వార్షిక చందా : పది రూపాయిలు

విడిప్రతి : ఒక రూపాయి

సంపాదకులు :

డా. సి. నారాయణరెడ్డి

వేమూరి ఆంజనేయశర్మ

చిర్రావూరి సుబ్రహ్మణ్యం

## ఈసంచికలో

సంపాదకీయం :

# అధికార భాష: తెలుగు-ఆంధ్ర ప్రభుత్వం

ప్రజల భాషలో పరిపాలన జరగడం అవసరమని మన పెద్దలు ఎప్పుడో నిర్ణయించి ఉన్నారు. పూజ్యులు మహాత్మాగాంధీగారు ఈ విషయాన్ని పదే పదే నొక్కి వక్కాణించి ఉన్నారు పరభాషలో ప్రభుత్వ వ్యవహారాలను నడిపించడం ఎంత మాత్రమూ సహించరాని విషయమని అందరూ ఎరిగియే ఉన్నారు. అదే నిర్ణయం ప్రకారం ఆంధ్ర ప్రభుత్వ వ్యవహారాలను తెలుగులో నడిపించవలెనని 1966 సంవత్సరంలోనే ఆంధ్ర శాసన సభ, విధాన సభ రెండూ ఒక శాసనాన్ని అంగీకరించి ఉన్నవి. శాసనం జరిగిందే గాని 1973 సంవత్సరం వరకు ఆ విషయాన్ని ఎవ్వరూ పట్టించుకో లేదు. 1973 సెప్టెంబరు 8, 9 తేదీలలో రాజ్య భాషా ప్రసార సమితి ఆధ్వర్యాన రాష్ట్రస్థాయి అధికార భాషా సదస్సు హైదరాబాదులో నిర్వహింపబడి ప్రభుత్వ దృష్టిని ఆ శాసనం వైపుకు ఆకర్షించడం జరిగింది. ఆ తర్వాత ఆదే సమితి పక్షాన కర్నూలు, ఏలూరు, చిత్తూరు, మహబూబ్‌నగర్ వంటి జిల్లా కేంద్రాలలో జిల్లా స్థాయి అధికార భాషా సదస్సులు జరగడం ప్రజల దృష్టినీ, ప్రభుత్వ దృష్టినీ ఈ సమస్య వైపుకు మళ్లించడం గూడా జరిగింది. ఆ కృషికంతటికీ ఫలితంగా శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్యగారి అధ్యక్షతను మొదటి అధికార భాషా కమీషన్ స్థాపింపబడింది. వావిలాలవారి తరువాత కొంతకాలం శ్రీ వందేమాతరం రామచంద్రరావుగారు, ప్రస్తుతం శ్రీ సి. నారాయణ రెడ్డిగారు ఆ కమీషన్‌కు అధ్యక్షులుగా ఉన్నారు. ఆ కమీషన్ పక్షాన కొంత మంది అధికారులను కలుసుకొనడం, తెలుగులో పరిపాలనా వ్యవహారాలను నడిపించమని కోరడం ఇంకా జరుగుతూనే ఉన్నది. ఏమైనా మొత్తం మీద సంతృప్తికరంగా పని జరుగుతున్నట్లు కనిపించడం లేదు. క్రింది స్థాయిలో పంచాయితీలు, జిల్లా పరిషత్తులు మొదలైన రంగాలలో కొద్ది కొద్దిగా పని జరుగుతున్నా అంత ప్రోత్సాహకరంగా లేదు. కేంద్ర ప్రభుత్వ శాసనాలు 60 వరకు తెలుగులోకి అనువదించబడినా అవి ఇంకా అచ్చు అయినట్లు లేదు. దానికి కావలసిన ఆర్థిక భారాన్ని కేంద్ర ప్రభుత్వం వహిస్తుంది. ప్రాంతీయ ప్రభుత్వం మీద ఆర్థిక భారం గూడా అంతగా లేదు. అయినా పని ఎందుకు ముందుకు సాగడం లేదో తెలియదు. ఆంధ్ర ప్రభుత్వ శాసనాలు కూడా కొన్ని అనువాదాలు పూర్తి అయినవి. అవి గూడా పెద్ద సంఖ్యలో అచ్చు అయినట్లు లేదు. ఈ శాసనాలన్నీ తెలుగులోకి అనువదించబడితేనే గాని కనీసం క్రింది కోర్టులలోనైనా తెలుగులో తీర్పులు రావడంగానీ, తెలుగులో చర్చలు జరగడం గానీ సంభవం గాదు. రెండోది తెలుగులో కార్యకలాపాలు నడిపించడానికి తెలుగు టైపు

రైటర్లు ఎక్కువగా లేవని అనడం తరచు వింటున్నాము. దాదాపు రెండువేల వరకు టైపు మిషన్లు కొనడం జరిగినా ఆ మిషన్లను అవసరమైన ఆయా కార్యాలయాలకు సరఫరా చేయడంలో కూడా చాలా జాప్యం జరుగుతున్నట్లు వింటున్నాము. టైపు మిషన్లతోపాటు టైపు చేసే వారికి శిక్షణ ఇవ్వడం కూడా ముఖ్యమైన పని. ఆ పని గూడా సంతృప్తికరంగా జరుగుతున్నట్లు లేదు. ఇంతేగాక, చాలా కాలంగా ఇంగ్లీషులో కార్యకలాపాలు నడుపుతున్న ప్రభుత్వ కార్యకర్తలకు పారిభాషిక శబ్దావళిని తెలుగులో అందించడం కూడా చాలా అవసరం. ఇదివరలో శ్రీ కాశేశ్వరరావు పంతులుగారి అధ్యక్షతన ఒక నిఘంటువు రూపొందించబడి వున్నది. దానిలో అవసరమైన మార్పులు చేర్పులు చేసి ఆధునాతనమైన పద్ధతిలో నిఘంటు నిర్మాణం జరుగవలసి ఉన్నది. వివిధ ప్రభుత్వ శాఖా కార్యాలయాలకు అవసరమైన పారిభాషిక పదాలను తయారు చేసి వేరువేరుగా అచ్చువేసి సరఫరా చేయవలెనని ఏనాడో తీర్మానం జరిగినా 15, 16 శాఖలకు మాత్రమే పదజాలం తయారయి అచ్చు వేయబడినట్లు తెలుస్తున్నది. సాధ్యమైనంత తొందరలో ఈ పదజాలాన్ని సృష్టించడం జరిగితేనేగాని ప్రభుత్వ కార్యకర్తలు ధారాళంగా తెలుగును తమ ఫైళ్ళలో ఉపయోగించలేరు. అన్నిటికంటే ముఖ్యమైన విషయం ఇంకొకటి ఉన్నది. రాష్ట్ర శాసన సభలోనూ విధాన సభలోనూ తెలుగులో అప్పుడప్పుడు చర్చలు జరుగుతున్నా ఇంగ్లీషులో ప్రవేశపెట్టబడే బిల్లులే అధికారిక స్థాయిలో ప్రామాణికంగా అంగీకరింపబడుతున్నవి. తెలుగులోను, ఉర్దూలోనూ ఇంగ్లీషు బిల్లుల అనువాదాలు ప్రచురింపబడుతున్నా అని అనువాద స్థాయిలోనే ఉండిపోతున్నవి. సారాంశమేమంటే ప్రజల భాష అయిన తెలుగులో ఏ విధంగా చూచినా ప్రభుత్వ కార్యకలాపాలు అనుకున్నంత ఉత్సాహకరంగా జరుగుతున్నట్లు లేదు. ఎన్నో త్యాగాలు చేసి భాషా ప్రయుక్తంగా రాష్ట్ర విభజనకు నాంది పలికిన తెలుగు దేశంలోనే తెలుగుకు ప్రభుత్వరంగంలో తగిన స్థానం లభించక పోవడం దురదృష్టకరమైన విషయం. ఆంధ్ర ప్రభుత్వ అధినేతలు త్వరలో ఈ లోటును గుర్తించి ఆంధ్ర ప్రభుత్వ రంగంలో తెలుగుకు తగిన స్థానం లభించడానికి తప్పక విశేష కృషి చేయగలరని విశ్వసిస్తున్నాము.

# గాలి వీధిని పడింది

-సోమసుందర్

గదిలో ఒంటరిగా కూర్చుంది గాలి
గెడ్డం క్రింద చేయి దాపెట్టింది
ఆలోచనలో బుర్ర గీపెడుతోంది
గుండె బరువెక్కి పోతోంది

సాయంత్రం క్షణాలు రాలుస్తోంది
పెణక నల్లని దుమ్మురాలుస్తోంది
వారింకా ఇంటికి చేరలేదు...
కన్నీరు జారుస్తోంది గాలి

సహాధ్యాపకులతో ఆఫీసర్లతో
కలసి వచ్చారు ఆలస్యంగా వారు
'రమ్మీ రమ్మీ' అంటూ ఆప్యాయంగా పిలుచుకున్నారు

"సాయంసధ్యా సౌందర్యాన్ని
గ్లాసులతో తప్ప మరెలా కొలుస్తారు?
రసికావతంసులు కదా వారు?
గింగిర్లాడు తున్నాయి గాలి స్వగతాలు
నంగి నంగి మాటలతో ఎదురైనపాతజ్ఞాపకాలు...

"శూన్యాటవుల కుంభమేళాలతో తప్ప
రసికాభోగంలో ఎలా పరవశిస్తారు?
ఆనంద భావుకులుకదా వారంతా?"
-అడవికి పోయిన గాలి తలంపులు
మత్తూ చిత్తూ చవి చూశాయి....

వీధిగదిలోపంకా కదులుతున్న ఝంకారం
లోపలిగదిలో జ్ఞాపకాల జ్వాలా ధ్యానం
చుట్టూ విరవీగే శూన్యదిగంతం
నిశ్శబ్దాన్ని చీలుస్తూ జలతరంగిణినాదం...

బుర్ర కావెక్కింది గాలికి
పెరటి గుమ్మం తెరచుకొంది
మత్తుగా వీధిని పడింది గాలి!
మత్తంటె మత్తుకాదు; ఆలోచనల భారం!
అవమానాల దుమారం... నిర్లక్ష్యాల సంక్షోభం....

రోడ్లనిండా జనసమ్మర్దం
కిట కిట లాడుతూ వస్తూ పోతూ జనం
జోగుతూ పురాస్మృతుల తేలుతూ
కాలికొద్దీ పరుగెడుతోంది గాలి

కిరాణాకొట్ల దగ్గర జనసందోహం
రణగుణ ధ్వనిగా వ్యాపారపారావారం
పాత్రసామాన్ల కొట్లలో శబ్దించే లోహం
గాలి తోచక సినీమా సెంటరు చేరుకుంది
త్రొక్కిళ్ళాడుతున్నారు త్రోసుకుంటున్నారు జనం
క్యూలో కుయ్యో మొర్రో మంటున్నారు జనం
ఎంత సాగినా సాగినట్లేలేదు-హనుమంతుడితోక

"బొమ్మ...అందాలబొమ్మ....ఎన్టీవోడి బొమ్మ
జోతిలచిమిడాన్ను దిమ్మతిరిగి పోతాది చూస్తే
ఓరబ్బో చూసేతీరాల... చూసేతీరాల ...!"
చిరిగిన చొక్కా ప్రకటిస్తూ విజయగర్వం
చిరుచెమట్లు తుడుచుకుంటూ రొప్పుతూ....
అక్కడి దృశ్యాలతో కళ్ళుతిరిగాయి గాలికి....

గాలి ఇంటి దారి పట్టింది
తన చుట్టూ జలతరంగిణీ నాదం
"పాపం వారెలా ఆస్వదిస్తారు?

అధర పాత్రలతో గాక?"
సాలోచనగా ప్రశ్నించుకుంది గాలి
ఉండుండీ తనలో తనకే కంపర మెత్తింది
"ఏవి తడి ఇసుకలో రాలిపడిన నక్షత్రాలు
ఎలా ఏరుకోగలరు నఖక్షతాలలో తప్ప"

అమర్త్య ఎప్పుడోగాని పాపం గాలి
వసంతద్రుమ కాంతులతో
ఆనంద రేఖల ఆశ్వాసనం పొందింది
నర రక్తధునుల కెలా అందేది?
సమాశ్లేష సమారాధనలతో తప్ప!
రసికులకెలా ప్రేరణ లభిస్తుంది?-
ఆనందానికి లింగభేదం కద్దు....

గాలి గుండెల్లో వారిపై సానుభూతి పెరిగింది
ఉడుకుమోత్తనం విరిగింది విస్తుపోయింది
ఎంతసేపు తిరిగినా తప్పదు పంచకి చేరుకోక-
తిరిగింది తిరిగింది విసివివేసారింది గాలి

ఆత్మీయులంతా ఖాళీచేసి వెళ్ళగా
ఒంటరిగా మిగిలారు వారు...మనలో ఉన్నారో లేరో?
పెరటి గుమ్మంలో అడుగు పెట్టేసరికి
దొడ్లోంచి నైట్‌క్వీన్ చేతులెత్తి ఆహ్వానించింది
పరిమళాలుచాపి కౌగలించుకుంది
ఇంట్లోకిదూరి తలుపులు బిడాయించుకుంది గాలి...

కళాకేళినికేతన్
పిఠాపురం: 533450 ఎ. పి.

# రాజధానిలో విద్యుద్దీపాలు

—వాసాల నరసయ్య

రాత్రి రాత్రంతా
రాజ్యం మేలుతున్నట్లు
చుక్కలే దిగివచ్చి
ఒక్కచోట చేరినట్లు
హుస్సేన్‌సాగర్‌చుట్టూ
మిణుగురు పురుగులు మూగినట్లు
ఈ జంట నగరాల
గల్లీలను పల్లాలను
ఎంతో కాలంగా వెలిగించే
ఈ విద్యుద్దీపాలు
ఇంకా యిక్కడి మనుషుల
మసకబారిన మనస్సుల్లోకి
ప్రసరించినట్టే లేదు.
మతమౌఢ్యంతో
మూసుకుపోయిన కళ్ళల్లోకి
దూసుకు పోయినట్టే లేదు.
అందు కొరకే నేమో
అదే ప్రయత్నమేనేమో
రేయంతా విడిగా నిలబడి
మౌనంతో ముడివడి తడబడి
ఆలోచన చేస్తూనే వున్నాయి
ఆవేదన చెందుతూనే వున్నాయి.

(రాజధానిలో "కర్ఫ్యూ" అమలులోవున్న ఒక రాత్రిని చూచి—)

వి. నరసయ్య
అసిస్టెంట్ పోష్టుమాష్టర్ (ఎకౌంట్స్) కరీంనగర్.

# నరుడు-వానరుడు

-మంత్రిప్రెగడ వీరభద్రమూర్తి

ఆ చంద్రతారార్కంగా
పరిభ్రమిస్తున్న భూగోళంపై
రాతియుగంనుండి-రాకెట్ యుగంవరకు
కోతినుండి పుట్టి పెరిగిన మనిషినిగూర్చి
చరిత్రచెప్పిన సత్యంఏమిటి?...
గత కాలంలోని వైభవాల
మధురస్మృతులతో పొంగి,
వర్తమానంలోని సుఖదుఃఖాల
తుంగతరంగాలలో కృంగి,
సతమతమయ్యే మానవజాతి
నేడు చైతన్యరహితమై
నిస్తేజంగా నిర్జీవంగా నడుస్తోంది!
నిరాశాపథంలోకి నడుస్తోంది!
ఆశయాల ఎత్తులనుండి జారి,
ఆదర్శాల శిఖరాల నుండి పడి,
అవినీతి లోయల్లో కుళ్ళి,
అజ్ఞానపు మైదానంలో జారి, పాకి,
దురహంకారపు దుర్గంధాన్ని వెళ్ళగక్కుతూ,
రాజబాటలో అడ్డంగాపడి,
చచ్చిబతికిన ఆశావాదిలా,
నిరాశానైరాశ్యంతో,
బక్కచిక్కిన కళేబరంలా,
నడువలేక, అడుగులువేయలేక
నిర్జీవంగా కదులుతోంది!
నిమిత్తమాత్రంగా మసలుతోంది!
సర్వకళలను కబళిస్తానంటూ
సర్వశాస్త్రాలను హస్తగతంచేసుకొన్న
భస్మాసురహస్తం శాస్త్రవిజ్ఞానంలో
పుట్టిపెరిగి పెద్దదవుతోంది!
దినదినం ఉషస్సంధ్యలు
యాంత్రికంగా వచ్చిపోతున్నాయి!
మహాసముద్రాలు అణుప్రేలుడులకు
కుతకుతలాడుతున్నాయి!
పసిపాపల అమాయక హృదయాల్లా!
ఏ క్షణాన్నైనా పంచభూతాలు
అవిరిగా హరించిపోతాయి!
విశ్వసృష్టిలోని
నవనాగరికతా సంస్కృతులు
ఒక్క త్రుటిలోనే
భస్మీపటలమై ధూళిగామారి
విశ్వంలో కలిసిపోతాయి!
మహానగరాలు అణ్వగ్ని జ్వాలలోపడి
నామరూపరహితమై కాలినుసిగా మారి
సుందరప్రకృతి వికృతమై పోయే
దుర్దినాలు దగ్గరలో వున్నాయా!
అనుకున్న మరుక్షణంలో
మృత్యుముఖాన పడినప్పటి
భయోత్పాతం కలుగుతోంది!
కొండల్లో, గుట్టల్లో, అడవుల్లో, లోయల్లో
గుహల్లో మత్తుగా పడి పుండకలసిన
ఈ గోముఖ వ్యాఘ్రాలు
మానవజీవన గృహవాటికలో నివసిస్తున్నాయి!!
సామ్రాజ్యతంత్రవాదులు
తమ భస్మాసురహస్తాలను కబంధ హస్తాలలా చాచి,
భూ ప్రపంచాన్ని గట్టిగా నొక్కిపట్టివుంచారు!
అణ్వస్త్ర పరీక్షలతో పంచభూతాలను
కలుషితం చేస్తున్నారు!
సర్వచారాచర సృష్టిలోని ప్రాణికోటి
పంచప్రాణాలను గుప్పెట్లో పెట్టుకొని
జీవిస్తున్నది! మరణిస్తున్నది! జీవిస్తున్నది!
జీవన్మరణవనవాటికి మధ్య అయోమయంగా
స్వర్గమో నరకమో, బ్రతుకో చావో
తేల్చి చెప్పలేని భయంకర క్షణం యిది!
దైవమో, దానవుడో

ఈ రణంలో గెలిచే అణుయుగంయిది!
మానవాళి భవిష్యత్తును తుదిసారిగా
తేల్చిముంచగల పరమాణుయుగం యిది!
ఆత్మశక్తిని, పరమాత్మశక్తిని
అర్థం చేసుకోని మనిషి స్వార్థంగా
అణుశక్తి నాధారంగా, నిరామయవిశ్వంలోకి
శూన్యంలోకి ఊర్ధ్వలోకాలకు
పయనిస్తున్నాడు-పరిగిడుతున్నాడు!
దైవంవున్నదంటే నమ్మలేనిమానవుడు,
నాస్తికుడై మానవజాతి ఆస్తికతనే
సర్వనాశనం చెయ్యబోతున్నాడు!
దైవం వునికినే శంకించి శోధిస్తున్నాడు!
అహం చంపుకోని ఈ మానవుడు స్వయంభవుని
సృష్టిని శోధించి అండపిండ బ్రహ్మాండాన్ని
పరిశోధిస్తున్నాడు!
స్వశక్తితో ఉట్టికి ఎగురలేనివాడు
శాస్త్ర విజ్ఞానంతో స్వర్గానికే ఎగురుతానంటున్నాడు!
ఆగ్రహావేశాలను అణుచుకోలేనివాడు
నవగ్రహాల విశ్వాంతరాళాలకు
పైపైకి పయనిస్తానంటున్నాడు!
భూతలముపై స్వర్గాన్ని కనలేని అంధుడు
నేడు చంద్రశిలను భూతలానికి జేర్చాడు
రేపు శుక్ర బుధ గ్రహాలనుండి ఏం తెస్తాడో,
ఆ తరువాత, ఏం చేస్తాడో, ఏమవుతాడో,
మానవజాతి భవిష్యత్తు, ఏమవుతుందో!
ఎవ్వరు మాత్రం ఏం చెప్పగలరు?!

ం ం ం

నేడు అణ్వస్త్రం ప్రసాదించిందేమిటి?
అణుశాస్త్రం సాధించిందేమిటి?
మనిషి మనసులోని మంచిని పెంచి
మనిషికీ మనిషికీ మధ్య మమతను పెంచి
మానవత్వంతో దైవత్వాన్ని సాధించనినాడు
నరుడు వానరుడై విజృంభించి తీరుతాడు!
మస్తిష్కంలో దాగిన దానవుడు
మానవునిపై వికటాట్టహాసం చేస్తాడు
తామసరాజసాలు ఆతని దురహంకార చిహ్నాలు
మదమాత్సర్యాలు ఆతని వినోదానికి సంఘర్షణ
ప్రేరణలు!
అహంకార దురహంకారాలు
దానవులకేకాదు దేవతలకైనా
ప్రత్యక్ష పతన హేతువులు!!
ఆత్మశక్తినెరుగని మనిషికి
మానవత్వం పెంచుకోని మామూలు మనిషికి
పరమాణు నిర్మాణరహస్యం తెలియడం
కోతికి కొబ్బరికాయ దొరకడం వంటిది!
ఇది యావన్మానవాళికి దౌర్భాగ్యం!
ఇది సృష్టి వినాశానికి, మరోసృష్టికి నాంది!
మనిషి హృదయంలో దైవం దాగివుంది
దైవం కుక్షిలో అమృతం పొదిగి వుంది
అమృతంత్రాగాలన్న దురాశ రక్కసులకుంది!
మనిషి మస్తిష్కంలో దానవుడు తిష్ఠవేసాడు
మానవాళికి అష్టకష్టాలను కలిగిస్తున్నాడు
దానవ సంహారం జరగాలంటే
దైవం వెలుగులోకి రావాలంటే
అణువును పూడ్చిపెట్టాలి
పరమాణువును నొక్కిపెట్టాలి
రేపు అన్నది వుంటే గింటే
అది నేటి మానవుని ఆత్మశక్తిలోవుంది
ఆ తరువాత ఆతని సత్ప్రవర్తనలో వుంది!
సమసమాజ స్థాపనలో వుంది!
ధర్మ సంస్థాపనలో వుంది! అది,
సత్యాహింసల ప్రాతిపదికల పునాదులపై వుంది!
కావున, నరుడు వానరుడైతే ఇంకేముంది!

M. V. Murthy, B.A.
Srinivasa colny (W)
Venugopalrao nagar Post
Hyberabad A.P. 500890

# నీరాజనం

-సాంధ్యశ్రీ

పాట పాడుదువన్న తలపొక్కటేగాని
పాట తానెవరుంచి బయటపడదు
భావ మెదలోన బంగరుతీగసాగి
చేయి తాకని వీణగ చిన్నవోయె....
దివసాంత సాంద్రతమః పటలీ
కుటీరమొక దివ్యకాంతి సరయు
అక్కడిందురేఖాభ్యుదయముచేసె
పశ్చిమాంగణ వీథికి పరుగులిడుచు....
ఏ గాలి కొనగోటి కొసతాకెనోయిట
కదులు చున్నది కమ్మని బాణి యొకటి
మడవీడి కలనైన మాటగా రాదేమి
మూగ వోయిన కంఠశోషగా- భాషగా....
మ్రోయించగానైతి నీ మహతి నెపుడు
రవళించు భావాల రాయంచలెగుర
నాబాల లీలా కలాపక్రియాలీన మందు
మ్రోగు చున్నవి రాగముల్ మోహమార...
పలుకు కిన్నెర వలపులొలక బోసిన
జాలు ప్రవహించి ఎదలోన పరిఢవిల్లె
వఃపు తూపులు కరసాన వాడి చేసి
పెరిమంబు జతచేసి పైన వేసె....
భావాతిరేకసంజనిత ప్రేమవారాశిలో
రాయంచ మలయికల్ రాణకెక్కె....
రాగాతిశయముచే రవళించు గానాన
పదము భావము వెంట పరుగుతీసె...
ఈ రీతి వలపు నెంతవరకు భరియింతు
తలపు తనియుదాక
తలపు కావలి ఏమి కలదన్న
నవ్వు కొన్నది మనసు మోమాట పడుచు...

మృదు మధుర పులక యొరపుగా
మై విరపుగా తానలము కొనియె
భావ మొదవని రీతిని బాహిరిల్లి ...
ఎవియో తలంపులనారతమ్ము
వికచనవవసంత మల్లికాసూనమై
ఎద పొదలందున సురభిళశ్రీల నించె
గంధ మొక జన్మానుబంధమ్ముగాగ....
పూపప్రాయాన పూవుల పొంగుజూచి
ఆత్మలో నద్వైత చింతలెగసె
మొదట వాసనలేని మొగ్గ మొగసాల
రేకు విచ్చిన చోట రేకెత్తె గంధము....
మనసు నందరలేని కూరిమి సెలంగ
చెలి మొసంగిన విరుల సరమ్మును
దాల్చితి- ప్రేమరూప మిద్ది యనంగ
యౌనొ-కాదొ-తెలియదీనాటివరకు....
కురంగలోచనీలోచన స్ఫురద్రస
వీక్షణా కైవల్య పథము దాటని
సంధానైక వైవశ్యముల్ గని
తలపోతురేమొ నన్నొక వెర్రిగా....
మలయచందన మైత్రీకషాయ
మాధురుల్ మోహాన ముర్మురించి
సాంధ్యశీతల పవనకరాంగుళీచ్ఛాయ
చిత్రాన నీతలపు చిలుకరించ
లలిత శృంగార రసవితర్దిపైన
రమ్యవిలాసహేవాక మతిశయిల్ల
నీ రూపలావణ్య నిస్తుల తేజమునకు
నీరాజనమ్మిచ్చు అస్మదీయ భావప్రమద.

దంతలూరు
522297

# దుఃఖ యాత్రి

-ముదివేడు ప్రభాకరరావు

ప్రభూ !

నిలువలేను ప్రభూ!
నిలువలేను ప్రభూ!!
కాళ్లు తడబడి
కరములే కుంటుపడి
నిలువలేను ప్రభూ!
నిలువలేను ప్రభూ!

మనసు ఝంఝు వీచి
హృదయ మేఘము కరిగి
కనుల నీరు కదలి
ఇరుల గూడులు నిండి
కాలువలై పొంగిపొరలి
వడిగా వాగై సాగుచు
ఈ యిసుక పాలబడి
ఇంకిపోయినది ప్రభూ!

ఏమి చేతును ప్రభూ!
ఏమి చేతును ప్రభూ!!
ఊటలూరని ఈ జీవితపుటెడారిలో
కన్నీటి కణాలనైన
నీపాదాల కడుగలేని
కాంతులీను నీ పదనఖముల
నా ప్రతిబింబము కాంచలేని

ఈ బడుగు పిచ్చుగుంటుపై
బాగీరథి వచ్చునా ప్రభూ!
కరుణించవే ప్రభూ!
శరణీయవే ప్రభూ!!
నీలో కలుపుకోవె ప్రభూ!
నిలుపుకోవె ప్రభూ!!

దూరపు కొండలు చూచి
మరులు గొన్నాను మొదట
ఏకతమ మరుస్థలిలో
పయనమైనాను అకట!
వెనకు మరలి పోవలేను
మరు పయనము చేయలేను
ఆదుకోవె ప్రభూ!
చేదుకోవె ప్రభూ!!
పాదదాసిని ప్రభూ!
బీదరాలిని ప్రభూ!!

చిల్లులు పడెనీ గుడారము
నిన్నటి యిసుక తుఫానుకు
సూది వెతికి తేలేను
సూక్ష్మములే తెలియలేను
గుడారము దిగబడగా
ఉద్ధరించి నిలువలేను
ఓపలేను! ఓపలేను!
విసుగులేని ఈ పయనము

నిలువలేను ప్రభూ!
పిలువలేను ప్రభూ!
బరువు దించవే ప్రభూ!
బాటసారిని ప్రభూ!!

4

ఇసుక కప్పల తక్కెడనే పోలిందీలోకం!
ఇసకపాతర నీ కరుణాప్లావిత స్వరూపం!!
ఆద్యంతాలే యిదమిత్థంగా తెలియని
నీ గాథారహస్యాలు త్రవ్వి ఎవరి తలకెత్తవలె
ప్రభూ!
అంతరమైన వెలుగై నీవందరిలో వున్నావని
ఒకరు చెప్పవలెనా ప్రభూ !!

రొదల తోడి రుజలు ముసరి
వెతల తోడి గుండె చెదిరి
బ్రతుకే ఒక పరిదేవనగా
ఇరులు పూచిన ఈ మరుస్థలిలో
యింకెన్నాళ్ళు ప్రభూ!

ఎటుల వేతును ప్రభూ!
దయ జూడవే ప్రభూ!!
దరి జేరవే ప్రభూ!
నిలువలేను ప్రభూ!
కలువ కన్నెను ప్రభూ!!

—ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్
యస్. వి. యూనివర్సిటి
తిరుపతి

# కలల బేహారి

-సుధామ

నువ్వు స్వప్నాలని అల్లుతుంటావు
బస్సుల్లో, ఆఫీసుతీరికల్లో, బెడ్‌రూం నిరీక్షణల్లో
రంగురంగుల ఊహల ఊలుదారపు ఉండల్ని ముందేసుకుని
కవిత్వం పొడుగూతా ముందుకాలాన్ని ఎం|బ్రాయిడిరీ చేస్తూంటావు

నీ భుజాలమీద పావురాళ్ళు ముక్కుతో పొడుస్తూంటాయి
పెరట్లో నెమలి పురివేసుకుని ఆరుస్తూంటుంది
ఏ యూకలిప్టస్ అడవుల్లోనో ప్రేయసి ద్రాక్షగుత్తులతో ఎదురుచూస్తూంటుంది

నువ్వు కలలుకనడం మానవు
పావురాళ్ళు ఎగరవు; నీ భుజవైశాల్యాన్ని దాటలేని స్వేచ్ఛతో
మబ్బుపట్టిన ఆకాశం కురవదు, నెమిలి దుబ్బుల్లోనే వుంటుంది
నీ అడవుల్ని సుగంధాల నూనెలకోసం పిండేస్తూంటావు
స్వెట్టర్లు అల్లుకునే సూదులుతప్ప ప్రేయసికేమీ మిగలవు
నిరీక్షణ కళ్ళల్లోనే అంటుకుపోయి వుంటుంది
అందంగా అలంకరించిన గది నలగని సినిమా సెట్టింగ్‌లా వుంటుంది.

పొడుగైన అంగరఖాతో, వంకీలు తిరిగిన క్రాఫ్‌ల సైన్యంతో
అక్షరాల బంతుల్ని సర్కస్ ఫీట్లతో ఎగరేస్తూ
ఎర్రటి చిలకముక్కుతో నువ్వు నవ్విస్తూనే వుంటావు
కవిత్వాన్ని హోలీరంగులా వెదజల్లుతూంటావు

పట్టుపీతాంబరాల పవిత్రతతో నీకు చుట్టూ ఏదీ కనబడదు
వెన్నెల మేడమీద వున్న నీకు గుడిసె అర్భకంగానే అనుతుంది
కలల బేహారివి నీకు కన్నీటి ముత్యాలు చవగ్గానే వుంటాయి
గులాబీ అత్తర్లు అద్దుకున్న నీకు చెమట ఆనదు

అదికూడా నీకు అందంగా అలదుకునే పరిమళంలానే తోస్తుంది
గజకర్ణ గోకర్ణ టక్కుటమారాల ఇంద్రజాలంతో నువ్వుపాతే టెంక
మామిడిచెట్టయి పళ్ళు పండడం హరితవిప్లవం కాదు
దాంతో ఆకలి తీరదు.

ఓ స్వాప్నిక మహారాజా!
పూలబాణాలతో శత్రుసంహారం కాదు జరిగేది
తామరతంపరల శత్రుజనన పరంపరే
నీ అంతఃపురంలోనే కూచుని వందిమాగధుల్ని వార్తాహరుల్ని చేసుకుంటే
గృహదహనాలు భోగిమంటలుగా
అసహాయ కన్నెల ఆక్రందనలు వలపుతీపులుగా
అస్పృశ్యతా ధోరణులు నేలాబండా దొంగాటలుగా
ఉత్పత్తిశక్తుల అణచివేత తొక్కుడుబిళ్ళకేళిగా
మంచుపల్లకీలు పూలపాన్పులుగానే వినిపిస్తాయి, కనిపిస్తాయి

క్షమించు
ద్రాక్షసారాలో ఉదయిస్తున్న ఉషస్తారా! నీతోనాకు చాలా పేచీవుంది
యుగాలనుంచీ నా కళ్ళ కన్నీళ్ళు కనబడకుండా
నవ్వు కలల్ని కుక్కుతూనే వున్నావు
ఆకలేసి కేకలేసినప్పుడల్లా నెమిళ్ళ నాట్యాలు చూపించి
శాంతిపావురాలను ఎగరేస్తూ
వెండిగిన్నెలో ముద్దలను గోరుమీద అందంగా ప్రదర్శిస్తూనే వున్నావు
నా గొంతులోకి దుఃఖాన్ని తప్ప దిగమ్రింగిందేమీ లేదు

నామీద అందమైన పాటలు రాస్తూనే ఉన్నావు
నా కండలు కొండలన్నావు, నాగుండె సూర్యుడన్నావు
నా స్వేదబిందువులు సింధువులన్నావు
కొండల్లో డైనమేట్లు పేల్చి నీ ఇళ్ళ స్థలాలకు చదును చేయిస్తావు
గుండెమీద వెన్నెలదుప్పటికప్పి మత్తుపాట వినిపిస్తావు
ప్లాస్టిక్ స్ట్రాలతో స్వేదాన్ని రుధిరంతో కాక్‌టైల్‌చేసి
మృదువుగా నాలిక చివళ్ళనుంచి చప్పరిస్తావు

నీతో నాకు చాలా ఆరోపణలున్నాయి
నా పక్షాన వున్నానని చెప్పి నీవు కారుస్తున్న మొసలి మొసలి కన్నీటిని
ఇవాళ నాకళ్ళ సెగ ఆవిరిచేసి ఊది పారేయాలనుకుంటోంది.
నువ్వు అమ్ముతున్న కలలకడగండ్లు బిచ్చగాళ్ళ రంగురంగుల గోళీలు
నీ పై పే వాటిని సరదాగా మొట్టికాయలుగా విసిరేస్తాడు అర్భకుడు
నువ్వింకా ఈ బజారులో నీ గతకాలపు కీర్తికిరీటాలను చూపి
అధికారం చెలాయించగలననుకోకు
నీ వలపు పొట్లాలు, ఊహల ఊలుదారపు ఉండలు ఇంక చెలామణీకి రావు
ప్రేగులుతెంపి వీణవాయిస్తున్న ఆర్తి మాది నీ పాట మాకు స్ఫూర్తికాదు

జీవనసమరంలో క్షతగాత్రులైన సైనికులగాథల్ని
కళ్ళుంటూ వుంటే చూసి, చెవులుంటూ వుంటే విని అక్కడ నిలబడు
నువ్వు వర్ణించిన మా చరణకమలాలు వర్తమాన పంకంలోంచి లేచి నడచి
ఎర్రటి నేలనాలుక నిండా కలల పాటలు కాక
దుర్మతిపై కానున్నరణాన్ని' ప్రయోగించనున్న విజయదుందుభిని
గీతాయుధంగా నిలిపి ఎలా సాగనున్నాయో చూడు

రాజుకట్టినకోట రాణిమెట్టిన తోట సామాన్యులకు పట్టంకట్టి
శ్రమైక జీవన సౌభాగ్యాన్ని స్థాపించగలదు చూడు
ఓ కలలబేహారీ! ఇంక దయచేయ్
జీవనసమరంలో రాలిన రక్తబిందువునుంచి పుట్టిన
కొత్తయుగం దూతలు అరుగో
ఎదురేగి స్వాగతం చెబుదాం
చెంపలేసుకుని చేవవుంటే నేలమీదకు దిగు

# సంక్రాంతి లక్ష్మి

-మల్లాది రామచంద్రశాస్త్రి

భూనభోంతరపు
సమ్యక్క్రాంతి!
సంక్రాంతి!
మౌని హృత్కమల
సౌరభయుక్త!
సంక్రాంతి!
ధ్యానామృతానంద
రత! భవ్య
సంక్రాంతి!
గానపీయూష
వర్షిణీ! దివ్య
సంక్రాంతి!

స్వాగతము! స్వాగతము!
స్వాగతము! సంక్రాంతి!
భూనభోంతరపు
సమ్యక్క్రాంతి! సంక్రాంతి!

శాంతికోటకెయైన క్రాంతియారాధ్యము
క్రాంతి క్రాంతి కోటక? కానెకాదు.
క్రాంతితెచ్చు దివ్యశాంతి సంక్రాంతియే
స్వాగతింపరండు! సకలజనులు-

గిరులొనర్చుతపము తరుల నానందము
పరవశించు విరులు పరిమళమున
ధరణిమాత తాను "ధన్యోస్మి"యనుకొను
దివ్యదీప్తి పర్వదిశల జగతి

చిత్తమౌను దివ్యచిత్రము వసుధను
విత్తమౌను జ్ఞానవిత్తమనని
విప్రులౌదురటులె విబుధులందరు భువి
వినయమను నయమ్ము ధనముకాగ.

పల్లెటూరివారి సల్లలితమ్మగు
జీవనమ్ము పరమపావనమ్ము
భావనమ్ము దివ్యభావనమదికాగ
పల్లెలెల్ల పాలవెల్లులౌను

భువియె కానిపించు దివియౌచు సంక్రాంతి
దివిచెలంగు నంతదివ్యవనిగ
అణువునణువునందు నానందవిస్ఫూర్తి
కణకణమ్ము జిందు కరుణరసము.

వేదవిదులు శాస్త్రవాదకోవిదులును
మోదమతులు దివ్యవాదరతులు,
"భా" రతులుగ నైరి భవ్యసంక్రాంతిని
"భా"రతమ్ము "దివ్యభా" రతమ్ము.

సంక్రాంతి మబ్బులు సంతసమ్ముచు గూర్చ
మామిడి పూవందె మహితసుఖము
బంతిపూవుసూక బంతిపూవులముద్ద
బంతిపూవుల పల్లెసీమలలరె.
మింటనంటెడు వాద్యమేదురధ్వనితోడ
జంటతోరణములు సంతసిల్లె,
గొబ్బిళ్ళ సేతలో తబ్బిబ్బులౌబాల
బాలికల్ సమ్మోద భరితులైరి,

హరిలోరంగహరి హరిహరియటంచు
పాటలను పాడు హరిదాసు పాటలువిన
సమ్మోదమ్ము విజృంభింప సకలమందు
దివ్యతయె కానవయ్యెను దివిని, భువిని.

సూర్యచంద్రులందు చుక్కలలోనను
నిక్కమైనదొక్క నిరుపమాన
సత్యమనుచు దివ్యసత్యముచాటె సం-
-క్రాంతి శాంతిదాంతి కాంతిదమ్ము.

ఇంతులందరు ధర పూలబంతులైరి
చెలుల చేమంతి పూవుల చెలువ మమరె
కాంతలెల్లరు కనదివ్యకాంతలైరి
భువిదివికి దివియు భువికి సందీప్తిగూర్ప.

విశ్వవిపంచి నినాదము
విశ్రుతముగ సంక్రాంతిని
ప్రాణికోటి హృత్తంత్రుల
ప్రణవనాదముగ జెలంగె

గంగిరెద్దులతోడ గంతులు వైచుచు
గంగిరెద్దులవారు కాన్కలగొన
పగటివేషమ్ముల ప్రథితులౌ వారికి
కాన్కలనిడి ప్రజల్ గారవింప

వేదశాస్త్రజ్ఞుల వేవిధమ్ముల ప్రజల్
సత్కారములను సంస్తుతులొనర్ప
సుకవి పండిత కోటి సుఖసముద్రమ్ముగా
కాన్కలనొసగి కాంక్షలనుదీర్ప

వేవిధమ్ముల జగతికి వెలుగునిచ్చి
భావబంధుర కల్యాణపథముజూపి
నరుని నరసఖు నొనరింప నరుగుదెంచె
శాంతిపథదర్శియౌచు సంక్రాంతిలక్ష్మి.

"సంస్కృతాంధ్రాది భాషాసు । యే మహాన్తః కవీశ్వరాః ।
భక్త్యా వయం సంస్మరామ । సంక్రాంతి సమయే సదా"

విజయ సాహితి
విశాఖపట్టణం



# భయమే నీపాలిటి మృత్యువు కావచ్చు

—డాక్టర్ సుమనశ్రీ

నువ్వొక మెస్మరిజం కళ్ళకి నిన్నునువ్వుగా
భయంతో శిలువ వేసుకున్న కట్టుబానిసవి
నీవు కంట్లో నలుసుపడితే భయపడతావు
పక్కలో పిల్లడు ఉలిక్కిపడినా
పొద్దున్నే పిల్లిపిల్ల ఎదురుపడినా భయపడతావు
ఎర్రరుమాలు ఎగురుతున్నా
ఎర్రత్రికోణం ఎదురుపడినా
ఎదుటివాడి కండల్ని చూసినా భయపడతావు
ఎదుటివాడి నోరు ఎర్రగా పండినా
ఎర్రజీరల కళ్ళన్నా నీకు భయమే
తెల్లగా తెల్లారిపోయిన కళ్ళు చూసినా నీకు భయమే

భయం నీ కనుగుడ్లచుట్టూ
పేరుకుపోయిన రక్తనాళాల్లో
నిశ్శబ్దంగా విషంలా పొంగుతూ వుంటుంది
మార్జువానాలా పాకుతూ వుంటుంది
భయం నీ మస్తిష్కాన్ని అనుక్షణం
మత్తులో ముంచెత్తుతూ వుంటుంది
ఘోరంగా వర్షిస్తున్న ప్రకృతిలోంచి
సముద్రాలు సముద్రాలుగా
నీ చుట్టూ పారుతున్న నీటిని చూసి భయపడతావు
రోడ్డుపై మరణిస్తున్న ఆకలికళ్ళు చూసినా
గాలికి కొబ్బరి మట్టలు గలగల్లాడినా
గుడ్లగూబ కళ్ళల్లోకి చూడలన్నా భయపడతావు
చీకట్లో కీచురాయి కీచుమన్నా నీకు భయమే
నిలువెత్తు పర్వతాల్ని నిలబడి వీక్షించాలన్నా
పర్వతాగ్రం నుంచి లోతైన ప్రకృతి కనుగుడ్ల
లోయల్లోకి చూడాలన్నా నీకు భయమే

నిలువెత్తు ధనాన్ని చూసీ భయపడతావు
నీ నిలువెత్తు బీరువాగురించీ నీకు భయమే

పిల్లల చదువులగురించీ
చదువులతర్వాత వేటాడాల్సిన
ఉద్యోగాల గురించీ భయపడతావు
పిల్లల పెళ్ళిళ్ళ గురించీ వాళ్ళ పెళ్ళాల గురించి భయపడుతావు
ఇంట్లో పెద్దపులన్నా ఆఫీసులో సింహమన్నా నీకు భయమే
శ్మశానం ప్రక్కనించి అర్ధరాత్రి నడవడానికి భయపడతావు
శ్మశానంలో నిశ్శబ్దంగా నిద్రిస్తున్న మృత్యువంటే భయపడతావు
శ్మశాన సంగీతాన్ని దూరంనించి వింటున్నా నీకు భయమే
భయం నీపాలిటి మృత్యువుకావచ్చు
నీ కంఠ నాళాన్ని ఒక్క త్రుటిలో తెంచనూవచ్చు
నిన్ను నోరెత్తలేని మృత్పిండంగా మార్చనూవచ్చు
ఒకొక్కప్పుడు భయం
నీ కాళ్ళలో పక్షవాతంలా పాకనూవచ్చు
వేళ్ళ మధ్య కుష్ఠువ్యాధిలా వ్యాపించనూవచ్చు
భయాన్ని కప్పుకొని
భయాన్ని నీ జీవితం కప్పులో
కొంచెం కొంచెంగా వొంపుకొని
భయంభయంగా నంగినంగిగా
నువ్వో అల్ప ప్రాణిలా బ్రతకనూ వచ్చు
నాకభ్యంతరంలేదు భయపడు భయపడు
మంచుగడ్డలా ఫ్రిజ్‌లో బందీవై
నిలువెల్లా వణుకుతూ చెమటలు పోసుకుంటూ
ఎర్రటి సూర్య నేత్రాలకు
అనుక్షణం భయపడు భయపడు.

క్వా. నెం. C1/బి. హెచ్.ఇ.ఎల్. ఆర్ & డి కాలనీ,
వికాసనగర్. హైదరాబాదు-500 593.

# నగరమూ - నేనూ ఒక్కటే

—రఘువర్మ

ఈ నగరమూ నేనూ ఒక్కటే !
ఎందుకంటే-నగరానికీ....నాకూ...
సామ్యాలున్నాయి!

ఈ నగరం ఎప్పుడూ....గలగలా
అలజడిగా...సందడిగా ఉంటుంది!
నేనూ అలాగే ఉంటాను!

ఈ నగరానికి ప్రశాంతత లేదు,
ప్రసన్నత లేదు!
నా క్కూడా లేదు।

ఈ నగరపు వదనాంతర్భాగంలో
విశీర్ణస్మృతులెన్నో దాగి ఉన్నాయి!
నాలోనూ దాగి ఉన్నాయి!

ఈ నగరపు టందాలు
అంబరంతో చేయి కలుపుతాయి!
నాలోని కోర్కెలూ....
చేయి కలుపుతాయి!

ఈ నగరం గుండెల్లో
రైళ్ళూ, బస్సూ....పరుగెత్తుతాయి!
నా గుండెల్లోనూ
సమస్యల రైళ్ళూ....బస్సూ....
పరుగెతుతాయి!

ఈ నగరం అలసినప్పుడు
తలుపులు మూసుకుని మేను వాలుస్తుంది!
నేను కూడా....
నా కంటి తలుపులు మూసుకుని
మేను వాలుస్తాను!

ఈ నగరంలో విద్యుద్దీపాలు
వెలుగుతాయి!
నాలో కూడానూ భావదీపాలు
వెలుగుతాయి!

రివ్వుమంటూ, జివ్వుమంటూ
దూసుకు వచ్చే....
శీతాకాలపు చలిగాలుల అలల తాకిడికి
ఈ నగరం తనువెల్లా వణకుతుంది!
అలాగే—భూతకాలపు గాలులకు
నా తనువూ వణికిపోతుంది!

తూర్పు కుంపట్లో రాజుకునే
సూర్యుడి మంటలకై—
ఈ నగరం వెచ్చదనాన్ని కోరి
ప్రతిరోజూ ఎదురుచూస్తూ ఉంటుంది!
నేను కూడా అంతే!
అందుకే—
ఈ నగరమూ నేనూ ఒక్కటే!

(ఆలోచనల అద్దంలో
శిశిర కోణంలో
నగరాన్ని చూసినప్పుడు)

Raghu Varma, M.A.
Room No. 37
C. Hostel,
Osmania University Campus
HYDERABAD-500 007.

# సాహిత్యగోష్ఠి

## జ్ఞానపీఠ బహుమతి గ్రహీత శంకరన్ కుట్టి పొట్టెక్కాట్

సమకాలీన సాహిత్యంపై దేశవ్యాప్తంగా భారతీయులలో ఆసక్తిని, అభిరుచిని పెంపొందించడానికి 1961లో అత్యంత ప్రతిష్ఠాకరమైన జ్ఞానపీఠ బహుమతిని ఏర్పాటు చేశారు. ప్రధానమైన 15 భారతీయ భాషలలో సృజనాత్మకమైన ఒక ఉత్తమ గ్రంథానికి ప్రతి సంవత్సరం ఈ బహుమతి ఇస్తారు. మొదటి బహుమతిని 1965 లో ఇచ్చారు. ఇంతవరకు 11 భాషలలోని గ్రంథాలకు ఈ బహుమతి లభించింది. 1980 లో ఈ బహుమతి శ్రీ ఎస్. కే. పొట్టెక్కాట్ మళయాళంలో వ్రాసిన "ఒరుదేశత్తింతె కథ (ఒక దేశం లేక గ్రామం కథ) అనే స్వీయ చరిత్ర నవలకు లభించింది. ఈ అవార్డును అందుకున్న వారిలో పొట్టెక్కాట్ పదిహేనో వారు. ఈ అవార్డును బహూకరిస్తూ శంకరన్ పొట్టెక్కాట్ జీవితాన్ని అనేక కోణాల్లో పరిశీలించి చూసి గ్రహించిన విషయాలను తన రచనతో చిత్రించారని రాష్ట్రపతి శ్రీ నీలం సంజీవరెడ్డి అన్నారు. అంతే కాక ఇది మామూలు నవల కాదనీ అది మహాకావ్య ప్రమాణాలను సంతరించుకుందని రాష్ట్రపతి అభివర్ణించారు. ఒక ఊరిలోని పాత్రల ద్వారా కేరళలోని గ్రామ జీవనం కళ్ళకు కట్టినట్టు ఇందులో చిత్రించడం జరిగిందని ఆయన అన్నారు.

*జీవిత విశేషాలు :*

కేరళలోని కాలికట్ లో 1913 మార్చి 14న శంకరన్ కుట్టిపొట్టెక్కాట్ జన్మించారు. పొట్టెక్కాట్ తండ్రి కుంజిరామన్ కాలికట్‌లోని గుజరాతి హైస్కూలులో అధ్యాపకుడు. తండ్రి చనిపోగానే అదే స్కూలులో పొట్టెక్కాట్‌కు ఉద్యోగం ఇచ్చారు. ఇట విస్మరింపరాని విచిత్ర సంఘటన జరిగింది, 1939 లో కాంగ్రెసు సమావేశం త్రిపురలో జరిగే రోజులవి. ఈ సమావేశంలో పాల్గొనాలని కుతూహలపడి పొట్టెక్కాట్ సెలవు నీయమని కమిటీ వారి నడిగారు. త్రిపుర సమావేశంలోనే పట్టాభి గారికి నేతాజీ, సుభాస్ బోసురు తీవ్రమైన పోటీ జరుగబోతున్నదనే వార్త దేశం అంతా అట్టుడికినట్లు వ్యాపించింది. గాంధీజీ పట్టాభిని బలపరిచారు. పొట్టెక్కాట్‌కు నేతాజీ అంటే అమితమైన భక్తి శ్రద్ధలు. స్కూలు మేనేజిమెంటు వారు గాంధీజీ అనుయాయులు అందువలన త్రిపుర వెళ్ళడానికి పొట్టెక్కాట్‌కు సెలవు దొరుక లేదు. సెలవు దొరకకపోతే పోనీలే అనుకొని స్కూలు ఉద్యోగానికి రాజీనామా చేసి సమావేశంలో పాల్గొనడానికి త్రిపుర వెళ్ళినఘనుడు శ్రీ పొట్టెక్కాట్.

మీ అబ్బాయి ఏం ఉద్యోగం చేస్తున్నాడు? అని లోకులు అడుగుతున్నారు. ఏం చెప్పేది? అని ఒకసారి వాళ్ళ అమ్మ అడిగిందట! 'నేను సాహిత్యకారుణ్ణి అని చెప్పు' అని పొట్టెక్కాట్ అన్నారట. ఇది గూడ పెద్ద ఉద్యోగమే అని తల్లి చప్పరించిందట!

ఇంక ఉద్యోగం లేకపోతే లాభం లేదని ఉద్యోగాన్వేషణకు బయలుదేరారు. ఒక పత్రికాసంపాదకుని కలిసికొంటే అప్రెంటిసు జర్నలిస్టుగా పని చెయ్యి. జీతం మాత్రం ఏమీ ఇవ్వం. జీతం ఇచ్చి ఉద్యోగ మీయడం మా పరిపాటి కాదు' అని సంపాదకు డన్నాడట, తలవంచడం అనేది ఆయన ప్రవృత్తికి విరుద్ధతత్త్వం. అందువలన ఏదో ఉద్యోగంలో చేరడం, ఆ ఉద్యోగం నచ్చకపోతే దానిని వదిలి పెట్టి మళ్ళీ క్రొత్త ఉద్యోగంలో చేరడం — ఇదీ పొట్టెక్కాట్ వరుస.

ఉద్యోగం కోసం నెమ్మదిగా బొంబాయి చేరుకున్నాడు. జేబులో డబ్బులయిపోయినాయి. ఇంటికితిరిగి వచ్చాడు. మళ్ళీ 1939లో బొంబాయి వెళ్లడం — ఉద్యోగం దొరకడం—మళ్ళీ దానిలో స్థిరపడక పోవడం – మరి - ఒకచోట కూర్చోనడం బుద్ధిమంతుని లక్షణం కాదు గదా! మళ్ళీ కాలికట్ తిరిగిరావడం. ఇతడు దేశాభిమాని అని, జాతీయవాది అని పోలీసు నిఘా ప్రారంభమైంది. పోలీసులను తప్పించుకొని మళ్ళీ బొంబాయి పారిపోవడం – ఉద్యోగంలో చేరడం - మళ్ళీ రాజీనామా ఇవ్వడం - మామూలు తతంగం అంతా జరిగింది. ఇంక ఉద్యోగ ప్రయత్నం అనవసరం అని భావించి పొట్టెక్కాట్ 1945లో రచనా వ్యాసంగాన్ని నిజజీవిత ధ్యేయంగా పెట్టుకొన్నారు. ఆ వేళ పత్రికా కార్యాలయంలోనే చేరి ఉంటే నాకు సాహిత్య క్షేత్రంలో ఊరూ – పేరూ లేకుండా పోయేదని వాపోతూ పొట్టెక్కాట్ ఒక అమెరికా మిత్రునితో తన కథను ఇలా చెప్పారు.

అనగా అనగా పీటరు. అమెరికాలో ఒక చర్చిలో ప్యూను. ఎన్నేళ్ళనుంచో ఆ చర్చిలోనే పనిచేస్తూ ఉన్నాడు. ఇంతలో క్రొత్త ఫాదరు వచ్చారు. చదువు రాని ప్యూను దేనికైనా కొరగాడని అతనిని ఉద్యోగం నుంచి తీసివేసాడు. పాపం ఇంకేం తోచక ఒక బడ్డీ కొట్టుపెట్టాడు. కొట్టు బాగా సాగుతుంది. వ్యాపారం జోరుగా సాగుతుంటే కొట్టును పెద్దదిగా చేశాడు. కొట్టు భామందు అయ్యాడు. పెద్ద షాపింగ్ కాంప్లెక్స్ మేనేజరు అయ్యాడు. ఒక రోజు బ్యాంకు మేనేజరు కొన్ని కాగితాల మీద సంతకం పెట్టించుకోవడానికి పీటరు దగ్గరకు వచ్చాడు. కాగితం మీద ఏమి వ్రాసి ఉందో గూడ పీటరు చదువలేకపోవడం చూచి బ్యాంకు మేనేజరు విస్తుపోయాడు. చదువు రాకపోతేనే ఇంత పేరు ప్రతిష్ఠ సంపాదించారు, చదువు వచ్చి ఉంటే ఇంకా ఎంత పైకి వెళ్ళేవారోనని బ్యాంకు మేనేజరు పీటరుతో అన్నాడు. ఆ మాటలు వినగానే పీటరు నవ్వుతూ "చదువుకునే ఉంటే ఆ చర్చిలో ప్యూనుగానే ఉండేవాడినని" జవాబిచ్చాడట! అలాగే పత్రికాకార్యాలయంలో చేరి ఉంటే మలయాళ సాహిత్యానికి సేవ చేసే అవకాశం దొరికేది' కాదు అని పొట్టెక్కాట్ తన మిత్రునితో చెప్పాడు.

రచనా వైశిష్ట్యం :

వ్రాయడం అనేది ఆయనకు చిన్నప్పటి నుండీ అలవాటే. మొట్టమొదట పొట్టెక్కాట్ వ్రాసిన కథ 1928లో కాలేజి మేగజైనులో పడ్డది దాని శీర్షిక "రాజనీతి". ఆ కథను మెచ్చుకుంటూ ఆయన టీచరు ప్రోత్సహించాడట! ఆ ప్రోత్సాహబలమే నన్నింతవాణ్ణి చేసింది అని అంటారు పొట్టెక్కాట్. "హిందూ ముస్లిం మైత్రి" అనే కథ దీపం అనే పత్రికలో వెలువడింది. బాబూ! మీ కథ పత్రికలో పడింది! చూడండి అంటూ ప్యూను వచ్చి చెప్పినపుడు నా ఆనందానికి అవధులు లేవని అంటారు పొట్టెక్కాట్. ఇది నా జీవితంలో మరువలేని ఘట్టం అని అంటారు, పొట్టెక్కాట్ సాహిత్య జీవిత అరుణోదయ కాలంలోనే 'యవనికక్కు పిన్‌గిల్ (తెర వెనుక) అనే కృతికి మద్రాసు ప్రభుత్వం వారి బహుమతి లభించింది.

కేరళసాహిత్య అకాడమీ వారు బహుమతును నిచ్చి ఆదరించినారు. వారి కృతులనేకం భారతీయ భాషలలోనికి ప్రపంచ భాషలలోనికి అనువదింపబడ్డాయి.

పొట్టెక్కాట్ కవి; నాటక కర్త; నవలా రచయిత; యాత్రా సాహిత్య రచయిత. ప్రారంభదశలో కవిత మీదనే ఆయన మొగ్గు ఉండేదట! తరువాత వీరు కవిత్వం వ్రాయడం మానివేశారు; నిర్దుష్టమయిన భావ ప్రకటనకు గద్యమే ఉత్తమ సాధనంగా నిర్ణయించుకొన్నారు. గద్యరచనలు దాదాపు ఏబది ఉన్నాయి. యాత్రికుని గీతాలు, ప్రేమశిల్పి - వీరి కావ్య సంకలనాలు అచ్చన్ (తండ్రి) వీరి ప్రసిద్ధ నాటకం. గద్యమేఖల వీరి వ్యాస సంకలనం. వీరు దాదాపు 350 కథలు రచించారు. 'మాతృభూమి' అనే పత్రికా సంస్థ వీరి కథల నన్నింటిని సంపుటాలుగా వెలువరించింది. వివేకోద్యమ్ అనే సంస్థ వీరి యాత్రా సాహిత్యాన్ని ప్రచురించింది. విషకన్యక, ముడుపడమ్, కరోపు (జనం), నాడమ్ ప్రేమమ్ (గామీణప్రేమ), కురములకు (మిరియం), ఒరుతెరవిండె కథ (ఒక సందుకథ), ఒరుదేశత్తిండెకథ (ఒక గ్రామం కథ), మూడుపటం (పరదా) వీరి ముఖ్యనవలలు. 'విషకన్యక' విశిష్టగుణోపేతమైన రచన.

మళయాళంలో కథానికా రచన ఆదిలోనే పరిపాకం పొందింది. సామాన్యంగా రచనాధోరణి ఉదాత్తంగా ఉంటూ వచ్చింది, కథానికా రచయితలుగా కృతకృత్యులయినవారిలో పొట్టెక్కాట్ పేర్కొనదగిన వారు. వీరు వామపక్ష రచయిత. వీరి కథావస్తువులు సామాన్యంగా సామాజిక సమస్యలు సంఘంలో జరిగే అన్యాయాలూనూ. తొల్లింటి కథారచయితలలో ఆధునిక కథ, నవలను మళయాలంలో వ్రాసి భాషా సేవ అపారంగా చేసినవారు పొట్టెక్కాట్. బాలకృష్ణ పిళ్ళై మళయాళంలో ఫ్రెంచి సాహిత్య ప్రక్రియలు ప్రవేశపెట్టినారు. మళయాళంలో మొపాసా రచనల గాఢ ప్రభావం తీసికొని రావడానికి ఆయనకు వాటి మీదకల అభిమానమే కారణం. కేరళదేశంలో అక్షరాస్యుల సంఖ్య అధికం. పత్రికాపఠనం సాధారణ ప్రజలలో బహు వ్యాప్తిలో ఉంది. అందువలన పత్రికలు సాహిత్యస్వరూపాన్ని దిద్ది తీర్చడం మొదలు పెట్టాయి. ఒకవైపు సాంఘిక, చారిత్రక నవలలకు - ఇంకొకవైపు కథానికా సాహిత్యానికి స్థానం కల్పిస్తూ పత్రికారచయితలను ప్రోత్సహిస్తూ వచ్చాయి. ఇలా పత్రికా ముఖాన పైకి వచ్చిన రచయిత పొట్టెక్కాట్, వీరి రచనలలో వాస్తవికదృష్టి కొట్టవచ్చినట్లు కన్పిస్తుంది. వీరయినంతవరకు సామాజిక జీవితాన్ని యథాతథంగా చిత్రించడానికి వీరు ప్రయత్నించారు. వీరి రచనలలో సామాన్య పాఠకజనం నాయికా నాయకులు కావడం విశేషం. బీదవారికి ప్రాముఖ్యం ఇవ్వడం మూలాన వీరి కథలకు, కథానికలకు విశేష వ్యాప్తి లభిస్తుంది. ప్రజాజీవితానికి సన్నిహిత సంబంధం కలిగినదీ – ఓజస్సు కలిగినదీ వాస్తవికమైనట్టి రచనలా భాసిస్తుంది. పొట్టెక్కాట్ యాత్రా సంబంధమైన గ్రంథాలు వ్రాయడంలో సిద్ధహస్తుడు. ఆయన యాత్రా సాహిత్యంలో ఆసియా, ఆఫ్రికా, ఐరోపా సంచారవర్ణన ఉన్నది. జపాను, ఆస్ట్రేలియా దేశాలు తప్ప ప్రపంచమంతా పర్యటించి వచ్చారు వీరు. వీరు హెలికాప్టరులో కూర్చొని సర్దాగా దుర్భిణీ యంత్రంతో పరికించి యాత్రలు కావించేవ్యక్తి కారు. వీరు అసభ్యమైన, అనాగరకమైన దేశాలు తిరిగి వారి జీవిత విధానాలను పరిశీలించిన దిట్ట. ఆయన దృష్టి ఉత్సాహదాయక విషయాలవైపు ఉంటుంది. సరళ ప్రసన్న శైలిలో ఆయన రచనా ప్రవీణుడు.

*ఒక ఊరి కథ :*

ఒరుదేశత్తింటె కథ. అంటే ఒక దేశం – ఒక గ్రామం కథ. ప్రధానంగా పేర్కొనదగిన కథ. ఈ నవలకే జ్ఞానపీఠం వారి అవార్డు లభించింది. ఇతర నవలలలో వరుల అనుభూతిని పురస్కరించుకొని ఇతివృత్తం ఎన్నుకోబడితే ఈ నవలలో ఆత్మానుభూతి నాధారంగా తీసికొని ఒక 'ఫొటో ఆల్బము' మన యెదుట తెచ్చి పెట్టినట్లుగా అనిపిస్తుంది. రచయిత చెప్పినట్లు ఇది యథార్థ గాథ. ఇందులో రచయిత నెత్తురులో కన్నీటిని కలిపి రంగరించాడు. ఈ రచనను కొనసాగించేటప్పుడు ఎన్నెన్ని సార్లు ఎక్కియెక్కి ఏడ్చానో నాకే తెలియదని రచయిత వాపోతారు.

'అతిరాణిపాడమ్' అనే చోటు ఈ ఇతివృత్తానికి కేంద్రం. శ్రీధరన్ ఈ చోటుకు చెందినవాడు; అభిమానంగల అధ్యాపకునికి కొమరుడు. విద్యార్థిదశలో ప్రేమలేఖలు వ్రాయడంలో గడసరి. సాహిత్యం అంటే అభిరుచి మెండు. పరిస్థితులు మారాయి. శ్రీధరన్ పార్లమెంటు సభ్యుడయ్యాడు. సాహిత్య క్షేత్రంలో పేరుప్రతిష్ఠలు సంపాదించుకొన్నాడు. ఒక ప్రాంతంలో జరిగే అభివృద్ధి కార్యక్రమాలతో పాటు, ప్రజల జీవితంలో వచ్చే మార్పులను ఈ నవల చదువుతూ ఉంటే రచయిత పొట్టెక్కాట్ శ్రీధరన్ రూపంలో పరకాయ ప్రవేశం చేసాడు అనిపిస్తుంది. ఇందులో నవలా కారుని చుట్టపక్కాలు అతిరాణిపాడమ్‌లో వెలసిన మనుష్యులు అయిదు దశకాలల్లో మారుతూ వస్తున్న యుగ చైతన్య మింములో ఇమిడి పోయింది.

1962 నుండి 1973 వరకు వీరు పార్లమెంటు సభ్యులు. ఈ సమయంలో పార్లమెంటులో జరిగిన భాగోతం అంతా కనులార చూచారు. ఈ అనుభవాలను ఆకళింపు చేసికొని ప్రస్తుతం వీరు ఒక నవల వ్రాస్తున్నారు. దీనిలో 'నార్త్ ఎవిన్యూ'లో జరిగే రాజనైతికపు భాగోతం అంతా ఉంటుందని మనం ఆశిసాం.

జీవిత దర్శనం :

రచయితగా ఫాట్టెక్కాట్‌కు కొన్ని అభిప్రాయాలున్నాయి. రచయితకు జీవితంపై నమ్మకం అనేది ఉండాలని వీరు భావిస్తారు. పాఠకులను ఆకట్టుకునేది శైలిగాదు; నమ్మకమేనని వీరి దృఢ అభిప్రాయం. రచయిత వృత్తికి దూరం కాకూడదు. తాను అనుభవించిన యథార్థ జీవితమే ఇది అనేట్టు రచన ఉండాలి.

అంటే అంధకారమనీ, దానినొక అభిశాపంగా తలంచే రచయితలు ఈనాడు బయలుదేరుతున్నారు. ఎటువు తెచ్చుకొనిన దుఃఖం, నిరాశ, నిస్పృహ, మృత్యువు – బీభత్సం – వీటిని చిత్రించడం ఈనాటి నవలా రచయితలకు పరిపాటి అయిపోయింది. మానవ ప్రేమను – జిజీవిషను పెంపొందించే రచనలు అరుదుగా వస్తున్నాయి. ఇట్టి క్లిష్ట సమయంలో జ్ఞానపీఠం అవార్డు ఫాట్టెక్కాట్‌కు రావడం ముదావహం. వీరి దృష్టిలో సాహిత్య మొక సాధన. విశ్వాసం అనేది సాహిత్యోపాసకునికి మూలమంత్రం అని వీరి భావన. సంఘం బాధ్యత నామీద ఉంది అని అంటాము. ఫాట్టెక్కాట్ ఏమి వ్రాసినా–నైతికంగా, సాంస్కృతికంగా సమాజం ఎదగాలి – సాహిత్యాన్ని చేకూర్చేదే సాహిత్యం – ఈ దృష్టి రచయితను మనిషిగా రూపొందించింది.

ప్రొఫెసర్ కర్ణ రాజశేషగిరిరావు
హిందీ శాఖ
ఆంధ్ర విశ్వవిద్యాలయం
వాల్తేరు

# మరాఠీ 'కాదంబరి' - హరినారాయణ ఆప్టే

తొలి నవల గురించిన ప్రస్తావన వచ్చినప్పుడు తెలుగువారికి కందుకూరి వీరేశలింగం గారి పేరు ఏవిధంగా గుర్తుకొస్తుందో మహారాష్ట్రులకు హరినారాయణ ఆప్టే గుర్తుకొస్తాడు. మరాఠీలో నవలకు "కాదంబరి" అనే పేరు ఇతని కాలంలోనే సార్థకమయింది. "హరి" ఆయన పేరు, నారాయణ ఆయన తండ్రిపేరు, ఆప్టే ఇంటి పేరు. మరాఠీ వాళ్ళు ఆయన్ని "హరి భాఊ" అని ప్రేమతో పిలిచేవారు. మరాఠీ వాళ్ళు 'భాఊ' అంటే అన్నయ్య అని అర్థము.

హరిభాఊ కంటే పూర్వం మరాఠీ సాహిత్యంలో నవలా ప్రక్రియ లేదని కాదు, కానీ ప్రాచీన మరాఠీ సాహిత్యంలో ఒక నూతన భావయుగానికి నాంది పలికిన గౌరవం హరిభాఊకు లభిస్తుంది. 1857 లో శ్రీ బాబా పద్మాజి రచించిన "యమునా పర్యటన్" మరాఠీలో మొదటి నవలగా పరిగణింప బడుతుంది. ఆ కాలానికి సంబంధించిన సమస్యల ఆధారంగా ఇది వ్రాయబడింది. తరువాత 1891 లో శ్రీ లక్ష్మణశాస్త్రి హాళ్బే తన "ముక్తమాల" అనే నవల ద్వారా మరాఠీ పాఠకులలో గాఢమయిన చైతన్య భావాన్ని నెలకొల్పాడు. అద్భుతమయిన సంఘటనలు, చమత్కారాలు, శృంగారం, వాటి కనుగుణమయిన శైలి – సజ్జనుల అంతిమ విజయం. దుర్జనుల పరాజయం ఇత్యాది అన్నీ అప్పటి మరాఠీ నవల్లో గోచరమయ్యేవి. వీటితోపాటు శ్రీ రా. వి. గూంజీకర్ నవల 'మోచన్ గడ్" చారిత్రాత్మక నవలా యుగానికి నాందిపలికింది.

హరిభాఊ పూర్వయుగాన్ని మరాఠీ సాహిత్య చరిత్రలో 'ముక్తమాలాయుగం'గా పేర్కొంటారు. అది హరిభాఊ యుగానికి పీఠిక వంటిది అనవచ్చును. హరిభాఊ జన్మించిన కాలం మహారాష్ట్రీయుల జీవితంలో వివిధ రంగాలలో మహామేధావుల కాలం. ఒకవైపు సామాజిక చైతన్యం విలసిల్లుతున్నది. మరొకవైపు బ్రిటిష్ పాలన, పాశ్చాత్య సంస్కృతులకు వ్యతిరేకంగా ప్రజల్లో సంచలనం ప్రారంభమయింది.

తత్ఫలితంగా అభ్యుదయ – భావాల అంకురార్పణ జరిగింది.

హరిభాఊ అగర్ కర్ నుండి సామాజిక సంస్కరణను గ్రహించి రానడే నుండి గ్రహించిన సంప్రదాయ సంస్కరణలకు సామరస్యం చేకూర్చాలనే అన్వేషణలో నవలారచన ప్రారంభించాడు. హరిభాఊ మొదటి నవల "మధలీస్థితి" మధ్య తరగతి జీవితాన్ని ఈ నవల ద్వారా ప్రతిబింబింప చేశాడితడు. 1885 నుండి "పుణేవైభవ్" అనే పత్రికలో ఈ నవల వరుసగా ప్రచురించ బడింది. స్కాట్ ను అనుసరించి వివిధ విషయాలను తీసుకుని నవలా రచనలో వివిధ రీతులకు శ్రీకారం చుట్టాడు.

మరాఠీ పాఠకులకు ఇతని నవలలు మనోరంజకంగా వుండేవి, ముక్తమాలా యుగంలోని నవలలకు ఇవి భిన్నంగా వుండేవి. పాఠకులకు చారిత్రక నవలల పట్ల వుండే గౌరవాన్ని, దేశభక్తి భావాన్ని పురికొల్పడానికి వుపయోగించు కున్నాడు, హరిభాఊ. చారిత్రక విషయాల్లోనే దేశభక్తిని మేళవించి సంభాషణల ద్వారా, ఆచార వ్యవహారాల ద్వారా అనాటి సాంఘిక పరిస్థితులను వివరిస్తూ స్త్రీల సమస్యలు, వితంతు వివాహాలు మొ॥ తన అభిప్రాయాలను పాఠకుల హృదయాలపై ముద్రించుకునేట్టు చిత్రించి జనంలో చైతన్యం రావడానికి కారకుడయ్యాడు. "చంద్రగుప్త," "రూప్‌నగర్ చీ రాజ్ కన్యా", "కాలకూట్", మొ॥ నవల్లోని చారిత్రక వాతావరణం ఇందుకు నిదర్శనం, "వజ్రాఘాత్", "ఉషఃకాల్", "గడ్ అలాంఛ్ సింహ్ గేలా", "పణ్ లక్ష్యాత్ కోన్ ఘేతో" ఇత్యాది నవల్లో తత్కాలీన వాతావరణాన్ని యథాతథంగా పాఠకుల హృదయాలకు హత్తుకునే విధంగా చిత్రించాడు.

హరిభాఊ నవల్లో కళాత్మక దృష్టి, సామాజిక జీవన దృష్టి సమ్మిళితమై వుంటాయి. సాధారణంగా మధ్య తరగతిలో విద్యావంతులయిన వారి పాత్ర చిత్రణ అధికంగా వుంటుంది. కథా వివరణలో జాతీయ చైతన్యం స్పష్టంగా గోచరిస్తుంది, 'మధలీస్థితి' (1885) నుండి 'కర్మయోగ్' (1917) వరకు అన్ని నవలల్లోనూ మారుతున్న సమాజ చిత్రణ కనబడుతుంది. ఆంగ్ల విద్య నుండి మొదటి ప్రపంచ యుద్ధం వరకు మరాఠీ వాళ్ళ జీవితాల్లో కలిగిన సాంఘిక, మానసిక పరిణామాల్ని హరిభాఊ నవల్లో చూడవచ్చు.

మన నిత్య జీవితంలో తారసపడే చిన్నా పెద్దా అన్ని పాత్రలు ఇతని నవల్లో కనబడతాయి. ఆ జీవిత గాథల్లో ఎంతో సహజత్వ ముంటుంది. "నా నవల్లో కల్పితమయిన పాత్ర ఒక్కటి గూడా లేదని" హరిభాఊ చెప్పుకునే వాడు. అతని నవలల్లోని ప్రతీ పాత్రా జీవితంలో అతని కత్యంత సన్నిహితంగా వున్నదే. కాని అతని నిజజీవితం సంతోషదాయకంగా గడువలేదు. 1864 మార్చి 8న జన్మించిన హరిభాఊ నారాయణ చిమ్నాజీ ఆప్టే జ్యేష్ఠపుత్రుడు. చిన్ననాడే మాతృవియోగం పొందిన హరిభాఊ అసలు పేరు 'బాలకృష్ణ'. కానీ ఆ కుటుంబంలోనే మరో బాలకృష్ణ వుండడంవల్ల ఇతన్ని 'హరి' అనే మారుపేరుతో పిలవాల్సి వచ్చింది. పిన తండ్రి మహాదేవ్ ఆప్టే పినతల్లి పార్వతీబాయి హరిభాఊను అల్లారు ముద్దుగా పెంచుకున్నారు. కొంత కాలానికి పినతల్లి కూడా పోయింది. తర్వాత తండ్రిగారి పినితల్లి హరిభాఊను పోషించే భారం పైన వేసుకున్నది. ఈ మహారచయిత నుదుట విధాత సుఖమనేది రాయనే లేదేమో అనిపిస్తుంది. చిన్ననాటనే మాతృవియోగం వలన తండ్రితోనూ చనువు కలుగలేదు. నిండు యవ్వనంలో ప్రథమ భార్యతో పాటు ఆమె ముగ్గురు పిల్లలూ పోయారు. రెండవ పెళ్ళి చేసుకున్నాక ఎంతో కాలానికి ఒక కుమార్తె కలిగింది. ఈ అమ్మాయిని అతిగారాబంగా పెంచుకున్నాడు. కానీ చివరకు ఈ అమ్మాయి గూడా అతన్ని అన్యాయం చేసి వెళ్ళి పోయింది, అప్పుడతని "వజ్రాఘాత్" నవల ప్రచురింపబడుతున్నది. ఈ సంఘటన అతనికి నిజంగా వజ్రాఘాతమే అయింది, తర్వాత ఏడాదికే ఇతని ప్రాణమిత్రుడు గోపాలకృష్ణ గోఖలే పరమపదించాడు, కుటుంబంలో ఆర్థిక ఇబ్బందులయితే వుండనే వున్నాయి. కానీ గోపాలకృష్ణ గోఖలే తాను స్థాపించిన "సర్వెంట్స్ ఆఫ్ ఇండియా సొసైటీ" ద్వారా ఇతని కుటుంబ పోషణకు శాశ్వత వ్యవస్థ ఏర్పరచి కొంత వరకు మనశ్శాంతిని ప్రసాదించాడు. ఇతని పినతండ్రి స్థాపించిన ఆనందాశ్రమ నిర్వహణ బాధ్యత కూడా

ఇతని పైననే పడడం వలన అందులోనే నివసించ నారంభించాడు. ఇతని ముఖ్య రచనలన్ని ఇక్కడ ప్రచురింపబడ్డవే. నిజజీవితంలో జరిగిన దుర్ఘటన లన్నింటిని సహిస్తూ తన ప్రేమపూరిత స్వభావంలోనూ అతిథులను ఆదరించడంలోనూ ఏలాంటిమార్పు రానివ్వ కుండా వినయశీలిగానే నిలిచి పోయాడు.

హరిభాఊ రచనల్లోనే అతని జీవితం ప్రతిబింబిస్తూ వుంటుంది. పతితల మనోరంజనానికే గాకుండా తన రచనావ్యాసంగాన్ని పతితోద్ధారణకు, దీనుల విమోచనానికి, మార్గభ్రష్టుల సంస్కరణకు అశాంతిత హృదయాల్లో నవచైతన్యం కొఱకు, సంఘ సంస్కరణకు, జాతీయ భావోద్దీపనకు వినియోగించి చాలా వరకు కృతకృత్యుడయ్యాడు.

1890 అక్టోబరులో పూణేలో "కర్మణక్"అనుపత్రిక స్థాపించి దానిని 28 సం॥ వరకు నిర్విఘ్నంగా కొనసాగించాడు. ఇతని నవలలు చాలా మట్టుకు ఈ పత్రికలోనే వరుసగా ప్రచురింపబడ్డాయి, ఎప్పటికప్పుడు తర్వాతి సంచికకోసం ఉత్కంఠతో ఎదురు చూసేవారు దీనిని బట్టి ఇతని కలానికున్న ఆకర్షణ అర్థమవుతుంది. ఇతని నవలలే గాకుండా వందలాది కథానికలు, లఘు వ్యాసాలు, సంక్షిప్త చరిత్రలు, విశేష వివరణలు – కవితలు ఇత్యాది ఎన్నో రచనలు ఈ పత్రికలో ప్రచురింపబడ్డాయి. ఇవేగాకుండా "సంత్ సక్కుబాయి" – "సతీపింగళా" అను నాటకాలు కూడా ప్రచురించాడు. అంతేగాక "ఆంగ్లో మరాఠీ – జ్ఞాన ప్రకాశ్" అను వారపత్రికకు సంపాదకుడుగా పనిచేస్తూ సంఘ సంస్కరణ గురించిన వ్యాసాలు ప్రచురించాడు. 1915 లో "Marathi - It's sources and development" అనే విషయం మీద చేసిన ఆరు ప్రసంగాలు తర్వాత ప్రచురించాడు.

ఒక్క సాహిత్య రంగంలోనే గాక అన్యక్షేత్రాల్లోను ఎంతో సేవచేసి కీర్తిగడించాడు హరిభాఊ. ఒకసారి పూణే పట్టణ పురపాలక సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నికయ్యాడు. విశ్వవిద్యాలయ పట్టా పొందక పోయినా విశ్వవిద్యాలయమే ఆయనను మరాఠీలో అత్యున్నత తరగతి పరీక్షకుడుగా నియమించింది. బొంబాయి – విశ్వవిద్యాలయము ఆయనను విల్సన్ ఫైలాజికల్ లెక్చరరుగా నియమించింది. 1915లో జరిగిన 16వ ప్రాంతీయ పరిషత్తుకు స్వాగతాధ్యక్షుడుగా పనిచేశాడు. చివరికి 1919 మార్చి 3 వ పూణేలోని తన ఆనందాశ్రమంలో సాయంకాలం ఇహలోక యాత్ర చాలించాడు.

మరాఠీ నవలా క్షేత్రంలో అనన్య సేవచేసి "మరాఠీ నవలా చక్రవర్తి"అనే కీర్తి వహించిన హరినారాయణ ఆప్టే నవలలు తెలుగు వారికి పరిచయం చేసిన వారిలో శ్రీ పి. వి. నరసింహారావు గారు; శ్రీ జగన్నాథ్ గారు; శ్రీ డి. వెంకట్రామయ్యగారు ముఖ్యులు. వీరి ద్వారా ఆ మరాఠీ నవలా చక్రవర్తి నవలలు చదివి ఆనందించే అవకాశం లభించినందుకు తెలుగు వారు వీరికెంతో ఋణపడి వుంటారు.

ఎస్. రాజవర్ధన్
S/o Sri S. Sadasiva M. A. BEd
Near DEO's Offiec
Vidyanagar Colony
ADILABAD - 504 002

* * *

# నది కదిలొస్తే

సాహిత్య నందనోద్యానంలో వికసించిన కావ్య సుమాలలో "నదికదిలొస్తే" కావ్యం పరిమళ భరిత పారిజాత సదృశము. ఈ కావ్య పారిజాతాలకు విలువ కట్టడం సామాన్యమయిన విషయము కాదు. అయితే విలువైన సాహిత్యముపై పాఠకులరసదృష్టి సన్నగిల్లుతున్న ఈ రోజుల్లో ఈ కావ్యం ద్వారా కొంత ఆసక్తిని పెంపొందించుకోవచ్చుననియే నాయభిప్రాయము.

ఏదైనా ఒక కావ్యాన్ని చదువు చున్నపుడు కావ్య ధర్మాలలో కొన్ని మాత్రమే పఠితల హృదయాలకు ఆకర్షక మవుతాయి. అవి పదముల రామణీయకత కావచ్చు, శైలి విన్యాసము కావచ్చు, అలంకార శోభ

కావచ్చు, రసపోషణ కావచ్చు, కాలానుగుణంగా కవి యెన్నుకొన్న ఇతివృత్తమూ కావచ్చు,

శ్రీ అన్నపురెడ్డి విజయభాస్కర రెడ్డి గారి "నదికదిలొస్తే" కావ్యంలో నన్నెంతో ఆకర్షించినది, వారు ఎన్నుకొన్న ఇతివృత్తము. గ్రామీణ జీవనాన్ని, రైతు జీవనాన్ని వారి కష్టసుఖాల్ని చూపిస్తూ, ఎన్నోవందల ఎకరాల భూమిని తన సాగరస్పర్శచే తడిపి క్షేత్రాన్ని సస్యశ్యామలంగా మార్చిన నాగార్జున సాగరము వారి కలానికి ఇతివృత్తము. ఎన్నో పల్లెలు సొగసుల్ని సంతరించుకొన్నాయంటే, వెలుగును నింపుకొన్నాయంటే, ఆనందకిరణాలు కెరటాలై ఎగశాయంటే, దానికి కారణము సాగరకరుణ. ఆ సంగమంతో పులకించని చెట్టులేదు. పరవశించని ప్రజలులేరు, పరిమళించని పల్లె లేదు.

శ్రీ సి. నారాయణరెడ్డిగారి "నాగార్జున సాగరము" కావ్యం తరువాత తెలుగు సాహిత్య క్షేత్రానికి సాగరాన్ని ఇతివృత్తంగా తీసికొని గ్రామీణ జీవనాన్ని చిత్రిస్తూ వచ్చిన గేయకావ్యం, "నదికదిలొస్తే" కావ్యమని చెప్పుట అతిశయోక్తి కాదు, స్వభావోక్తియే.

సాగరజలాల సంస్పర్శతో పులకితుడైన కవి కృషీవల జీవనసరణిని చిత్రించుటలో కృతకృత్యుడయ్యాడు. అయితే దైవికమయిన రెండు మూర్తులు కవికి ప్రత్యక్షమయ్యాయి. ఒకరు పలుగును శ్రమశక్తికి చిహ్నంగా తలపోసే శ్రామికుడు, చెమటబొట్లు చెలమలందు చిరునవ్వుల పండించే హాలికుడు. వీరిరువురి హృదయాలను దర్శించిన తదుపరే సాగర నిర్మాతలైన నేతలను కనుగొన్నాడు. ఇది కవియొక్క చిత్తసంస్కారానికి లక్ష్యసిద్ధికి, అభ్యుదయ భావానికి, ప్రతీక.

సాగర క్షేత్రానికి పునీతమయిన చరిత్రవుంది. కొందరి మహాత్ముల మూలంగా పేదవాడూ, ధనికుడు అన్నవ్యత్యాసము లేకుండా, ఆ పవిత్ర సాగర సన్నిధిలో సేద దీర్చుకొంటున్నాడు. ఇలాంటిది ఈ కావ్యానికి ఇతివృత్తము కావడం ఎంతో ప్రశంసనీయము. వీరి కవితలో లలితమాధుర్య పదగుంభన, సంస్కృత పదముల రమణీయత, తెలుగు పదముల తియ్యదనము, పాఠకుల్ని రసప్రపూర్ణుల్ని చేయగల శైలీ విన్యాసము, సాక్షాత్కరిస్తాయి. కావ్యం చాలా వరకు మాత్రాఛందంలో పయనించింది. "ఎన్నిసార్లు దర్శించిన కన్నులదాహము తీరదు" సాగరాన్ని దర్శించిన కవి పలికిన పల్కిది. పొంగి పొర్లే సాగరాన్ని చూస్తూ, భావకుడైన కవి హృదయంలో మధురానుభూతి ఉదయించింది. అందుకే సాగరాన్ని చూచి

"తెలుగుజాతి ప్రాంగణాన
వెలిగిన మణి దీపమ్మది
దాహార్త జనత కొఱకు
తరలి వచ్చు మేఘమ్మది"
"ఎవరిదోయి చెలికాడ
ఈ పునీతసాగరము
ఇంకెవరిది–నీదినాది
ఇటపుట్టిన ప్రతిమనిషిది
కలలుకనే ప్రతి మనసుది
కనిపెంచినకృష్ణమ్మది"

అంటూ సాగర సన్నిధిలో పరవశించి గానం చేస్తున్నాడు. ఇది స్వయంగా కవియనుభవించి తన హృదయంలోని–భావనాస్రవంతిని సాగర సంగమంతో పునీతం చేసాడు.

ఈ కవి రసవాదియనియే చెప్పాలి. కవియైనవాడు తాను దర్శించిన వస్తువు నందలి సౌందర్యము నారసి తత్సౌందర్యమును రసానుగుణంగా తానాస్వాదించి పాఠకలోకానికి అనందాన్ని, తద్వారా విజ్ఞానాన్నీ, అందిచడమే కావ్య ప్రయోజనమని, కావ్యజ్ఞుల ప్రవచనము.

ఈ కవి సహజంగా రైతుకుటుంబములో జన్మించి గ్రామీణ జీవితముతో, రైతు జీవనంతో ముడివడ్డ అనుబంధం వున్నదని కావ్యంలోని ప్రతీ గేయంలో కవి ఆత్మీయతాముద్ర ప్రత్యక్ష మవుతుంది. లేనిచో, 'కృష్ణవేణి జలముసోకి, గట్లుసైతం పూలుపూచెను' అని అనగలడా! ఇంకా విరగగాచిన మిరపతోటల్ని, ఉల్లితోటల్ని, ఎలనవ్వుల గంధాన్ని చిలికే కొతిమీరల్ని, పాటమరించే కొన్నపైరుల్ని, తలలూచే వరి వెన్నుల్ని తిలకించగలడా! చూచినది చూచినట్లు చిత్రించి పాఠకుల్ని పొలాలపై విహరింప చేసే అనుభూతిని కలిగించాడు.

ఈ కావ్యంలో తెల్లదొరల పాలనలో ప్రజలనుభ వించిన కష్టాలు కన్నీళ్లచోటు చేసుకొన్నాయి. సాగర నదీ జలాలవల్ల పొంగారే బంగరు పంటల పరవళ్లు, పసి పాపల కేరింతలతో, పరవశించే పల్లెటూళ్లు, వల్లనిరేగళ్ల ఎదల పల్లవించే నారుమళ్లు, అడుగడున సస్యలక్ష్మి అందెల సవ్వళ్లు, కావ్యంలో పాఠకుల్ని పలకరిస్తుం టాయి. అంటే, గతానికి వర్తమానానికీ అపురూప మయిన సేతువు.

పొంగిపొరలే సాగరాన్ని తదేకంగా చూస్తున్నాడు కవి. ఆ సాగరపు అలలకన్న తన మనసులోని ఆలోచ నా కెరటాలు కట్టలు త్రెంచుకుని విజృంభించసాగాయి. సాగరఅలల సరిగమల కంటె, కొన్ని వందల బ్రతు కుల వేదనాస్వరాల్ని కవి హృదయం చూడగల్గింది. అందుకే సాగరాన్ని చూచి పట్టలేని హర్షంతో ఇలా అంటున్నాడు.

" ఆకలితో అలమటించు
అన్నార్తుల కమృతమది
పొలము దున్ను రైతుకొఅకు
పొంగి పొరలు సాగరమది"

తెల్లదొరలపాలనలో ప్రజలు బానిసలుగాబ్రతికారు. వారి దురాగతాలకు హద్దులు లేవు. గలగల పారే సెలయేళ్లను కుట్ర జేసి బంధించారు. కపోతాల గూళ్ల పైనకత్తి కట్టి రక్తం చిందించారు. పల్లెటూళ్ల చుట్టు ముళ్లకంచెలను పెంచారు. కదులుతున్న మనిషిగుండెలో కలుకు కత్తులను దించారు. ఊహించగల మనసులకు ఉరిత్రాళ్లను పంచారు. జాతి మనుగడను చైతన్య రహితం చేశారు. తిరగడం తప్పు, ఉల్లాసంగా నవ్వడం తప్పు ఒక గుండెను వేరొక గుండె ఓదార్చడం తప్పు. కదలడం తప్పు! కవిత వ్రాయడం తప్పు, ప్రజల జీవనగతి భయంకరంగా సాగుతున్న రోజులవి. ఆసమయంలో చైతన్యానికి ప్రతినిధి, ఒకపల్లెరైతు బిడ్డయిన కోటిరెడ్డి ధైర్యం వహించి తన ప్రజలను చైతన్య దీప్తిలో నడిపించాలని నడుం కట్టాడు. క్రూర మయిన దొరలపాలనలో మనకు విముక్తిలేదని, మనకు ఎవరి తోడునీడా అవసరం లేదని మన శక్తి సామర్థ్యాలు మన చుట్టూవున్న పైడి పొలాల ప్రకృతి అందచందాలని ప్రజలలో సామరస్య భావాన్ని కల్గించేందుకు పాటుపడి వారి నోదార్చుతూ.

"తెల్ల దొరలు మన సంగతి
తెలుసు కొనుట నట్టిమాట
ఎవరు మనకు తోడు నీడ
ఈ పొలములు జలములు"

రైతు సిరితల్లికి నమస్కరించడు. నేల తల్లికి మొక్కు-తాడు. వారి శ్రమశక్తికి చిహ్నంగా బంగారాన్ని వెలార్చే వరి కేదారాలే వారి జీవనాధారాలు. కోటిరెడ్డి పలుకులందు ఎవరి అండదండలపై మనము బ్రతుక నవసరము లేదని, ఈ పొలములు, జలములు వున్నంత వరకు మన రైతు జీవన సంజీవీణియ రవళి, అన్నధ్వని పూరిత భావం ప్రస్ఫుటమవుతుంది.

ఇలా కొంత కాలం కాలచక్రం పరిభ్రమించింది. ఊరుయాయత్తు కరువురాకాసి నోటపడింది. అంతట క్షామానికి గురియై ప్రజలు తల్లడిల్లారు. ఆ పరిస్థితి ప్రజల నాయకుడైన కోటిరెడ్డి హృదయాన్ని కలచి వేసింది. అతని కంటి వెంబడి అశ్రుధారా స్రవంతి, పొంగి ప్రవహించింది. అతని హృదయపు వ్యధఊహగా మారి సాటిరైతు సోదరుల డెందాల్ని పలకరించ సాగింది.

"ఏకమెత్తిన పొట్టగడిచెడి
బ్రతుకులెన్నో కలవు పల్లెన
రోజు కూలికి పనులు చేసెడి
ప్రజల గతులకు ప్రభువు లెవ్వరు,"

ఆమని అరుదెంచి అందాలమ సంతరించుకొన్న పల్లె బ్రతుకుల్లో కరువురాకాసి పల్లెసుల నింపి ప్రళయ తాండవం చేస్తుంటే, ఆ ప్రజల జీవనగతి వివరించడం కష్టతరం. పొలములో పైరునిండి, బావులలో, నీరెండి, పొలుకరువై పసిపాపలు, పూట గ్రాసానికి నోచుకోని పశువులు ఆరోజు కష్టపడితే గాని కడుపు నిండని కార్మికులు, ఎన్నో భయంకర బాధల వలయంలో బ్రతుకులు బరువుగా సాగే రోజులవి. ఈ స్థితిలో కోటిరెడ్డి అందరి బాధా తనదిగా చేసుకొని, కన్న తల్లి కృష్ణవేణిని దీనాలాపంగా హృదయ విదారకంగా పిలువ సాగాడు.

ఎన్నో ఏళ్ల తరబడి మాతృమూర్తి పరిష్వంగానికి ఎడ బాటయిన తనయుని పిలుపులా వుంది. ఆపలుకు.

"కనుల ముందు పారుతున్న
కన్నతల్లి కృష్ణవేణి
కన్నీళ్లను తుడిచి వేయ
కదలి కదలి రాకూడద''

ఎంతో అర్ద్రంగా వుంది భావన. కవి హృదయం స్పందించి కోటిరెడ్డి పాత్రలో తన వ్యక్తిత్వాన్ని ప్రతి ష్ఠించుకొన్నాడు. ఆ పిలుపులో జాలి, కరుణ, అను రాగం, అన్నీ రాశీభూతమయ్యాయి.

''జలగలవలె మనరక్తము
పీల్చుకొనెడి పాపాత్ములు
ప్రభువులుగా దొరకుట
ప్రారబ్ధం కాదా మరి.''

జాతిని చైతన్య హీనం చేసే పరాయిపాలన నీడలో తన ప్రజలు తలదాచుకొన వలసి వచ్చినదని బాధ'' ఒక ప్రక్క, శ్యామదరిద్రదేవత కేళితో కళాహీనమైన, పల్లెల పరిస్థితి మరొక ప్రక్క.

ఇలా ఎంతోకాలం ఈ పరిస్థితి కొనసాగకుండగనే కరువు కాటకాల కబంధ హస్తాల నుండి ఆ గ్రామాలు విముక్తిచేయబడ్డవి. వెంటనే కుండపోత వర్షం. పల్లెలో పసి పాపల కేరింతలు, కోటిరెడ్డి హృదయంలో పొంగు లెత్తు అనందం, పల్లెసైతం పరవసించి పిల్లనగ్రోవి పాడసాగింది.

కోటిరెడ్డి నాయకత్వం పైన అతని ప్రజలపైన ఆనాటి బ్రిటిషు ప్రభుత్వానికి కన్నుకుట్టింది. పసిపాప లాగా పెంచుకొన్న పైరును వారి హయముల చేత త్రొక్కించారు. రైతన్నల శ్రమ బిందువులతో పుల కించిన నేలతల్లిని ధ్వంసం చేశారు. అంతటితో వారి దౌష్ట్యాన్ని ఆపక కోటిరెడ్డిని సైతం కారు చీకట్ల కారాగార వాసానికి గురి చేశారు.

జైలు నుండి విడుదలయిన కోటిరెడ్డిలో ఆవేశంలేదు, దిరుగుబాటు తత్వం లేదు, కసి, పగ అంతకంటే లేవు. కల్లాకపటం ఎరుగని రైతన్నలో ఇవేమీ కనబడలేదు. తన పల్లె కరుదెంచాడు. అగని అనందం అలల్లై సాగింది. హృదయంలో కోటివీణల నాదం మొదమై సాగింది. అప్పుడు.

''కొట్టమందు తిరుగుతున్న
కోడెల మెడల దువ్వెను
నిన్న మొన్న పుట్టినట్టి
చిన్న లేగను ముద్దిడుకొనెను.

కోటిరెడ్డికి తన క్షేమం కన్న కోడెల క్షేమం మిన్న' అందుకే లాలనగా, మృదువుగా, కోడెల మెడలను దువ్వ సాగాడు. నిజమే మరి రైతుకు ఎడ్లే సర్వస్వం అవే అతని ప్రాణం. వాటి పాలనలోనే తన శ్రమ నంతా మర్చిపోగలడు. చెంగు చెంగువ పరుగుతీసే చిన్న లేగల పరుగుల్లో తన ముంగిలి ప్రభావిత మగుతుంటే, అంతకన్నా అనందం రైతన్నకు లేదోమో! అందుకే జైలు నుండి రాగానే కోటిరెడ్డి కోడెల క్షేమాన్ని పరామర్శించాడు. చిన్న లేగను ముద్దిడుకొన్నాడు. ఆ పల్లెలో వరికోతలు మొదలయినవి. పల్లీయుల ఉల్ల ములలో పాలకడలి పొంగింది. అ గ్రామీణుల జీవితంలో వారికున్న అనందం అనిర్వచనీయము పాట పాడుతూ పరవశంతో పనులు చేసుకుంటున్న కూలీలు తమ శ్రమకు ఫలం పొందబోతున్నా మనెకి ఆనందంలో తీయని తలపులను నెమరు వేసుకొంటున్న యజమానులు వరికుప్పలను చూస్తున్న వారు, ధాన్యపు రాసులను వరి కించే వారు, కూలీల సంభాషణను తిలకించే వారు, ఎందరెందరో ఆ వాతావరణ మంతా ఎంతో ఆనం దంగా, ఆహ్లాదంగా. పల్లె ప్రజల కనుకూలంగా, సాగి పోతున్న సమయమిది.

అంతే, తెల్లవార్ల దోపిడీ మూకతో ఆ ప్రకృతంతా కంపించి కళ్లెర్ర జేసింది, వారి దురాగతాల కోరల్లో ధాన్యపు రాశి గడగడలాడింది. తెల్లదండు కళ్ళము సమీపించి, కోటిరెడ్డికి చేరువయింది. ఆ దృశ్యాన్ని చూచిన కోటిరెడ్డి తెల్లమూకను చెదర గొట్టడానికి తన వారిని ఆయత్తపరచాడు. ప్రాణాల నొడ్డి అయినా పోరాటం సాగింతమన్నాడు. వెంటనే ప్రతి ఇల్లు దొరలపై పదును బల్లెమై తాకింది ప్రతి పల్లె దొరలపై పులి పిల్లమై దూకింది. దండు మూగింది ధాన్యపురాశి చుట్టు. తెలదొరల కర్కశహస్తాలలో ధాన్యపురాశి విలపించ సాగింది,

అయినా మంద స్వరంతో కోటిరెడ్డి మందలించాడు. "దగ్గులవలె దొరలుకూడా దోపిడీలు చేతురా, పిండారీ గుంపులవలె పల్లెల బాధింతురా అని వలికాడు. అయినా లాభం లేకపోయింది.

"ఏం మోసము జరిగిపోయెను
ఇపుడు వగచిన ఫలితమేమిటి?
త్రాసు పాముల పడగ నీడల
తలలు వాల్చుట తప్పుమాదిలె"

ఆ పల్కులతో దొరలు పౌరుషాక్రోశము ఆ ప్రాంగణమంతా ప్రతిధ్వనించింది. మరతుపాకులు కోటిరెడ్డి మెడకు గురిపెట్టారు మరుక్షణలో ఊహించలేని పరిస్థితి. ధాన్యపురాశిలో ఊయలలూగే నేలతల్లి రక్తంతో సిక్తమైంది. నిరాశాయులైన గ్రామ ప్రజలు తెల్లవాళ్ల తుపాకులతో కాల్చి వేయబడ్డారు. కోటిరెడ్డి దీనమైన స్థితిలో నేలకు తల వాల్చారు. అతని ఆఖరి శ్వాస సైతం పల్లె చుట్టూ పరిభ్రమించింది.

ఈ దృశ్యాన్ని చూచిన వీరపేరమ దిగ్భ్రాంతి చెందింది. హృదయంలో అగ్ని పర్వతాలు బద్దలయ్యాయి కంటి వెంట అశ్రుధారా ప్రవాహం ప్రభవించింది. ఆమె ఊహాలన్ని భర్త చుట్టూ చేరి పలకరించసాగాయి. హృదయ విదారకమయిన శోకంతో పరితపించింది.

"తనను పిలిచెడి రెండు పెదవులు
ధరణి గుండెల వ్రాలిపోయెను".

వెంటనే తేరుకొని వీరపేరమ ధైర్యము సడలకుండా ఒక్కసారి వర్తమానంలోకి వచ్చి రుద్రమదేవిలా విజృంభించింది. ఆ విజృంభణ బ్రిటీషు ప్రభుత్వ ప్రాసాదాల్ని పునాదులతో సహా పెకలించేలా వుంది. ఆమె కోపాగ్ని పొంగి, ముందుకు దూకి తెల్లమూకను చీల్చి చెండాడింది. తనచుట్టూ వస్తూన్న దొరలదండును అందినంత వరకు తెగటార్చింది. తన శక్తి సన్నగిల్లినంత వరకూ పోరాడింది. కడ కశక్తయై భర్త సన్నిధిలో ప్రాణాల్ని బాసిన, వీరపేరమ భర్తకు తగ్గ భార్య అనిపించింది. తుదకు ఆ ప్రకృతంతా స్తంభించి వారి కథకు కైమోడ్పున్నట్లుగా కొండలు మొదలు కోనల వరకు రోదించసాగినవి.

"నేల విలపించెను
గాలి విలపించెను
నింగి విలపించెను
పరిసరాలు........
పూల పరిమళాలు"

కడకు విశ్వంభరయే దీనంగా మౌనం వహించింది.—

కె. పోతులూరయ్య
భాషాప్రవీణ,
ఎస్. బి. ఎస్. సంస్కృత కళాశాల
పొన్నూరు, గుంటూరు జిల్లా.



# తెలుగు ప్రాచీన స్థితి

-తూమాటి దొణప్ప

ప్రకృతికీ, మానవప్రకృతికీ మార్పు సహజ లక్షణం. మానవుల భావప్రకటన సాధనమూ, ప్రగతి శీలమూ అయిన భాషపట్ల ఈ మార్పు అన్నది మరింత సహజం. మంచి మార్పు, వికాసానికి మారు పేరు. భారతీయ రాజ్యాంగం గుర్తించిన మొత్తం పదిహేను భారతీయ భాషలలోనూ, నాలుగు దక్షిణాది భాషలలోనూ తెలుగు ఒకటి. దీనికి తెనుగు ఆంధ్రం అని కూడ ప్రచురవ్యవహారంలో ఉన్న పర్యాయ వాచకాలు. తెలుగునాటనూ, భారతదేశంలోని యితర రాష్ట్రాలలోనూ, మలేషియా, మారిషస్ మున్నగు పరాయి దేశాలలోనూ సుమారు ఆరు కోట్లమంది దీనిని మాతృభాషగా వ్యవహరిస్తున్నారు. భారతీయభాషలలో హిందీ తరువాత అధిక సంఖ్యాకులయిన వ్యవహర్తలు కలిగిన భాషకూడ తెలుగే! దేశభాషలందు లెస్స అనీ, ఇటాలియన్ ఆఫ్ ద యీస్టు అనీ యింటా బయటా నిస్తుల ప్రశస్తిని పొందిన యీ భాషకు వెయ్యేళ్ళ ప్రామాణిక సాహిత్య చరిత్ర వుంది.

అయితే, దీని పుట్టు పూర్వోత్తరాలను గురించిన వివాదాలు కొన్ని లేక పోలేదు. ఆర్యభాషలని వ్యవహరించబడుతున్న సంస్కృత ప్రాకృత భాషలనుంచి తెలుగు పుట్టిందని పరంపరగా తరలివస్తున్న అభిప్రాయం. 'జనని సంస్కృతంబు సకల భాషలకును', 'తల్లి సమస్త భాషలకు దైవత భాషయ', 'తల్లి సంస్కృతంబె యెల్ల భాషలకును' - మొదలయిన ఉద్ధరణలు మనకు కొత్తలు కావు. తెలుగు ఆర్యభాషాజన్యం కాదనీ, ద్రావిడ భాషలని వాడుకపడిన తమిళం కన్నడం, మలయాళం మున్నగు భారత దేశీయభాషలకిది జ్ఞాతి భాష ( congnate language ) అనీ రాబర్ట్ కాల్డ్వెల్, ఎచ్. గుండర్ట్, యూల్‌బ్లాక్, యం. బి. యెమెనో, థామస్‌బరో మొదలయిన పాశ్చాత్య విద్వాంసులూ, యల్. వి. రామస్వామి అయ్యర్, కె వి. సుబ్బయ్య, కోరాడ రామకృష్ణయ్య, గంటి జోగి సోమయాజి, శ్రీ కంఠయ్య, వజ్ఝల చిన సీతారామస్వామి శాస్త్రి, భద్రిరాజు కృష్ణమూర్తి ప్రభృతి దేశీయ పరిశోధకపండితులూ ప్రమాణోపపత్తి సంకలితంగా చేసిన నిర్ధారణ. ఆర్యభాషా ప్రతిపాదనను సమర్థించిన జి. యు. పోప్, చిలుకూరి నారాయణరావు ప్రభృతుల వాదాలు నిర్యుక్తికాలయి నందున తిరస్కరించబడ్డాయి.

తెలుగు లాక్షణికులలో ప్రసిద్ధుడయిన కేతన తన ఆంధ్రభాషా భూషణంలో 'తల్లి సంస్కృతంబె భాషలకును' అని ఒకవైపు సంస్కృత భాషా ప్రాథమ్యాన్ని ప్రచురపరిచే సామాన్య సూత్రాన్ని ప్రతిపాదిస్తూ, 'దానివలన కొంతకానంబడియె-కొంత తాన కలిగె, అంతయు నేకమై-తెనుగు బాస నాగ వినుతికెక్కె'అని మరోవైపు తెలుగు పృథగస్తిత్వాన్ని సమర్థిస్తూ వివరణ రూపమన విశేష విధిని అనుసంధించడం మనం విస్మరించకూడని విషయం. సంస్కృతం ఆద్యప్రకృతి అనీ, ప్రాకృతం ద్వితీయ ప్రకృతి అనీ శాబ్దికుల పరిగణన. ప్రకృతిద్వయ నిరపేక్షంగా తెలుగు తనంతతానుగా కొంత యేర్పడింది; సంస్కృత ప్రాకృత భాషలతోడి సంసర్గ

సంబంధంవల్ల తత్సమతద్భవరూపమయిన శబ్దసిద్ధి తెలుగున కొంత కలిగింది. ఆ కొంతా యీ కొంతా, అంతా కలిసి ప్రవృత్తి రూపంగా యేకమై తెలుగు భాసగా రూపు దాల్చిందని శాస్త్రీయరీతిలో కేతన ప్రతిపాదనను వ్యాఖ్యానించడం యథార్థ కథన మవు తుంది. తనంత తానుగా ఏర్పడిందన్న తెలుగునందలి యీ దేశ్యభాగం సంస్కృత ప్రాకృత భాషలతో, జన్యజనక సంబంధం లేనిది; తమిళం, కన్నడం మున్నగు సోదర ద్రావిడ భాషలతో సజాతీయ సంబంధం కలది.

ఇటీవల దేశ విదేశాలలో ద్రావిడ భాషల పరంగా పెరుగుతున్న కృషిసైతం కాల్డ్వెల్ ప్రతిపాద నకు అదనపు బలాన్ని చేకూర్చింది. అందుచేత, తెలుగు ద్రావిడ భాషాకుటుంబానికి చెందినదన్న ప్రతి పాదన నేటికీ చివరి మాటగా-సిద్ధాంతంగా-చెలామణీ అవుతూ స్థిరీకరించబడింది. ద్రావిడీ విజ్ఞానం (Dravidology) గూర్చి విశ్వవ్యాప్తంగా కొనసాగుతున్న విస్తృత పరిశోధనా రీతి యీ ప్రాతిపదిక మీదనే ఆధారపడి వుంది. పుట్టుకను బట్టి యోజిస్తే నేటి ద్రావిడ భాషలన్నింటికీ మాతృకగా సంభావితమూ, ఊహాసిద్ధమూ అయిన మూలద్రావిడ భాష (Proto-Dravidian) తెలుగునకు కన్నతల్లి; ఇది నిసర్గ సంబంధం. పెంపకాన్నిబట్టి వివేచిస్తే ఆర్యభాష తెలుగునకు పెంపుడుతల్లి; ఇది సంసర్గ సంబంధం. అంటే యీ రెండు సంబంధాలవల్లా యిద్దరు తల్లుల ముద్దుల బిడ్డగా తెలుగు ప్రవర్తిల్లుతూ వచ్చిందని తాత్పర్యం. భౌగోళికంగా చూస్తే తెలుగు మాట్లాడే ప్రధాన ప్రాంతం ఆర్య-ద్రావిడ భాషా వ్యవహార ప్రాంతాలకు నట్టనడుమ నెలకొని వుంది. పుట్టుక, పెంపకాలనుబట్టి ద్రావిడ భాషాగతమైన మాధుర్యమూ ఆర్యభాషా సహజమైన గాంభీర్యమూ చక్కగ సగం పాళ్ళలో మేళవించిన విశిష్టగుణం తెలుగునకు సంక్ర మించిందని కొందరు భావించడం కద్దు.

తెలుగు భాష ప్రాచీన స్థితినీ, వికాసాన్నీ నిరూపించడానికి ఆయా యుగాలకు చెందిన శాసనాల లోని భాషాసామగ్రి ముఖ్యమైన ఆధారం. ఒకొక్క యుగంలోని భాషాధ్వనులూ, వర్ణనలూ, సంధినియ మాలూ, ధాతుప్రత్యయ నిర్మాణం, పదరచనన, సమాస పరికల్పన, వాక్యవిన్యాసం-మొదలైనవేర్పగు అంతరువులలో వ్యాకరిస్తే తెలుగు భాషా స్వరూపం తేట తెల్లమవుతుంది. ఈ శాస్త్రీయ పరిశీలనారీతిని ఒక నిర్దిష్టయుగానికి పరిమితం చేస్తే దానిని వర్ణనాత్మక పద్ధతి లేక సమకాలిక/ఏకకాలిక పద్ధతి (descriptive or synchronic method) అని అం టారు. పూర్వ యుగాలలోని భాషాస్వరూపం ఉత్తరోత్తర యుగాలలో ఎలా మార్పు చెందిందీ,యీ మార్పు ఒక నియమబద్ధమయిన పద్ధతిలో ఎలా ప్రవ ర్తిల్లిందీ నిరూపిస్తే అది చారిత్రిక లేక ద్వైకాలిక/ భిన్నకాలిక(historical or diachronical)పరి శీలనమవుతుంది. ఆయా యుగాలలో ప్రవర్తితమయిన పరిణామాలకు కారణాలు ఆ భాషాపరమయిన అంత ర్నిహిత శక్తులా? సంసర్గంలోని పరభాషలప్రభావమా! అని కూడ సమీక్షించవలసి వుంటుంది. అనుదినం మారుతున్న విలువలనుబట్టీ అనుక్షణం పెరుగుతున్న అవసరాలను బట్టీ భాషలలో మార్పులు రావడం తప్పని సరి. ఈ కోణాలనుంచి పరిశోధనను నిర్వహిస్తే తెలుగు భాష స్థితిగతులు కొంత వరకు బోధపడతాయి.

తెలుగు భాష తనకు మాతృక అయిన మూల ద్రావిడ భాషకు ఎంత కాలందాకా మాండలికంగా ఉండిపోయిందీ, ప్రత్యేకభాషగా స్వతంత్ర ప్రతిపత్తిని ఎప్పుడు సంతరించుకుందీ స్పష్టంగా నిర్ధరించడానికి ప్రత్యక్షప్రమాణాలు లేవనే చెప్పాలి. క్రీ.శ. 200 నాటికే తెలుగుభాష వాడుకలో ఉన్నట్లు లిఖితరూప సాక్ష్యాలు కొకొల్లలుగా లభ్యమవుతున్నాయి. పైన పేర్కొన్న కాలానికి పూర్వం తెలుగుభాష **వుందా?**

ఉంటేయెప్పటి నుంచివుంది ? ఏ రూపంలో ఉంది? మున్నగు సవాలక్ష సందేహాలకు సరియయిన సమాధానాలు చెప్పడం అంతసులువయిన పనికాదు.ఇలాంటి స్థితిలో విషయనిర్ధారణకు ప్రత్యక్షప్రమాణాలమీద కాక, అనుమాన ప్రమాణాలమీద ఆధారపడక తప్పదు తెలిసినవి ఆధారంగా తెలీని విషయాలను ఊహించి, ఒక క్రమపద్ధతిలో రూపించి ధ్రువపరచడ మన్నది చరిత్రమూ, శాస్త్రమూ సమ్మతించిన పద్ధతి.

క్రీ. శ. 200 కు పూర్వదశకు చెందిన తెలుగు అస్తిత్వాన్ని స్థాపించడానికి ఉపకరించే అనుమాన ప్రమాణాలను ముఖ్యంగా మూడింటిని పేర్కొవచ్చు. క్రీ పూ. పదోశతాబ్దినాటిదిగా పరిగణించబడుతున్న ఐతరేయ బ్రాహ్మణంలోని 'ఏతేఽంధ్రాః పుండ్రాః శబరాః పుళిందా మూతిబా ఇత్యుదంత్యా బహవో భవంతి' అన్న ఉద్ధరణ యందలి 'ఆంధ్ర శబ్దం జాతిపరంగా ప్రయోగించడంవల్ల ఆ జాతి వాగ్రూప వ్యవహారమొకటి —దానిని తెలుగుఅనండి, ఆంధ్ర మనండి—ఆనాటికే వుండివుండాలని వూహించడం సత్యదూరంకాదు. ఒకవేళ ఐతరేయ బ్రాహ్మణం ఇంకా ప్రాచీన తమమని ఎవరైనా వాదుకు వస్తారా, మరీ మంచిది! ఆపక్షంలోనూ తెలుగు ప్రాచీనతను స్థాపించే మావాదానికి ఢోకాలేదు. తెలుగు ప్రాచీనతను నిర్ణయించే ప్రయత్నంలో ఇది మొదటి అనుమాన ప్రమాణం.

తెలుగునకు సజాతీయ భాషఅని నిర్ద్వంద్వంగా నిశ్చితమయిన తమిళభాషలో క్రీ పూ. ఒకటి రెండు శతాబ్దుల కాలంనాటికే ప్రామాణిక సాహిత్యం, ప్రసిద్ధ లక్షణ గ్రంథసంచయమూ వెలసివుందన్న విషయం స్థితిస్థాపకాశం. రుచిర సాహితీసృష్టికిగాని, ప్రమర లక్షణ గ్రంథరచనకుగాని వాహకమయిన భాషఎంత ప్రాచీనమో, ఎంత ప్రామాణికమో సుస్థాపపత్తులతో అంచనావేయగలిగితే తమిళభాషా ప్రాచీనత అవగతమవుతుంది ఇంత ప్రాచీనమయిన తమిళభాషకు సద్దోబుట్టువయిన తెలుగుకూడ దానితోపాటు పరిఢవిల్లి వుండవచ్చునని ఖరారుచేయడం ఉత్తమ పరిశోధనా పద్ధతికి విరుద్ధం కాదు తెలుగు ప్రాచీనతను నిర్ధరించడానికిది రెండో అనుమాన ప్రమాణం.

ఇక, మూడో ప్రమాణం: క్రీ. శ. 200 నాటికే తెలుగు వాడుకలో ఉన్నట్లు శాసనాదిక ప్రత్యక్ష సాక్ష్యాలు ప్రకటిస్తున్నవి గనుకా, యే భాషకూడా వున్నట్టుండి ఒకానొక శుభోదయాన ఆకాశంనుంచి రెడిమేడ్ దినుసుగా వూడిపడదు గనుకా అంతకు పూర్వం సైతం తెలుగుభాష వాడుకలో ఉందని నిష్కరించడంలో తప్పులేదు. శాతవాహన చక్రవర్తి హాలుడు సంకలయితగా రూపెత్తిన గాథాసప్తశతిలో కనిపిస్తున్న వన్నదేశిపలుకు బళ్ళలో అన్నీకాకపోయినా కొన్ని అయినా తెలుగు మాటలు కావచ్చని కొందరి భావన పైన ఉట్టంకించిన మూడు అనుమాన ప్రమాణాలు ఆధారంగా తెలుగుభాష క్రీస్తునకు పూర్వము వేయారువత్సరాల నుంచీ వెలుగొందుతూ వచ్చిందని చెప్పవచ్చు.

తెలుగుభాషా ప్రాచీనతను ఇలాగా మనము నిర్ధరించ గలిగినప్పటికీ అవిజ్ఞాతమయిన ఆ ప్రాథమిక యుగాలలో దాని స్వరూప స్వభావా లేమిటన్న ప్రశ్నకు సరియయిన జవాబును పొసంగించడం దుస్సాధ్యం.ప్రత్యక్ష నిదర్శనాలు దొరకనందున తొలినాళ్ళలోనితెలుగు రూపురేఖలు మనకు బొత్తిగా తెలీవని ఒప్పుకోకతప్పదు. అందుకే, తెలుగుభాషా చరిత్రలోని తొలిదశను అజ్ఞాతయుగమని చరిత్రకారులు పేర్కొనడం సంభవించింది. ఈ యుగంలో సామాన్య జనవ్యవహారంలో తెలుగుభాష వుందని చెప్పగలమే కాని, యే రూపాన వుందో ఇదమిత్థమ్మని రూపించలేము.

సుమారు క్రీ శ. 200 నుంచీ క్రీ. శ. 575 దాకా విస్తరించిన కాలాన్ని తెలుగు భాషా చరిత్రలో

సంస్కృత ప్రాకృత శాసన భాషా యుగమని పరిభాషించడం మామూలు. ఈ నిర్దిష్టకాలంలో తెలుగు నాటిని పాలించిన శాతవాహనానంతరీకులు-ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, శాలంకాయనులు, విష్ణుకుండినులు-తమ దానాదికాలను ప్రకటించే రాజాజ్ఞలను శాసనరూపాన సంస్కృతంలోనో, ప్రాకృతంలోనో వెలయించడం మీది పరిభాషాపరికల్పనకు మూలం. క్రీ శ. 575 నాటిదిగా శాసన పరిశోధకులు సిద్ధయించిన ఎర్రగుడిపాడు శాసనం ఇప్పటికి దొరికిన తెలుగుశాసనాలలో మొట్టమొదటిదని అంటున్నారు. ఈ శిలాశాసనం కడపమండలం కమలాపురం తాలూకా ఎర్రగుడిపాడు గ్రామంలోని చన్నకేశవస్వామి దేవాలయం ప్రహరీగోడమీద కనుగొనబడింది. రేనాటి చోడవంశానికి చెంది, ఎరికల్ ముత్తురాజు అన్న మారుకపేరు గల ధనంజయుడు వేయించిన దానశాసన మిది.

ఎర్రగుడిపాడు శాసనకాలాన్ని (క్రీ.శ. 575) ఒక హద్దుగా గుర్తించి ఆ నాటినుంచి తూర్పు చాళుక్య వంశీయుడయిన రాజరాజ నరేంద్రుని పట్టాభిషేక విజయ సంవత్సరం అంటే క్రీ. శ. 1022 వరకూ వ్యాపించిన కాలాన్ని తెలుగు భాషా చరిత్రలో మరొక యుగంగా పరిగణిస్తున్నారు. రాజరాజ నరేంద్రుని ఆస్థాన కవియై పోషకుని అభ్యర్థన మేరకు వ్యాస భారతంలోని కొంతభాగాన్ని తెనిగించి, తెలుగున ఆదికవి అనీ, వాగనుశాసనుడనీ పేరు పొందిన నన్నయ భట్టారకుని కృషిని కాలాన్ని ప్రాఙ్నన్నయ యుగమని నిర్దేశించడం జరిగింది. ఈ యుగానికి చెందిన తెలుగు శాసనాలు నూటాయాభైకి పైగా దొరికాయి. వీటికి తోడు ఈ యుగంనాటి సంస్కృత శాసనాలలోని దేశీయమయిన తెలుగు భాగం కూడ పరిశోధనకు మూలసామగ్రిగా ఉపకరిస్తుంది.

క్రీ. శ. 1022 నుంచి క్రీ. శ. 1100 వరకు గల కాలాన్ని నన్నయ యుగమనీ క్రీ శ. 1100 నుంచి క్రీ. శ. 1850 దాకా గల కాలాన్ని మధ్య యుగమనీ, నాటి నుంచి నేటి వరకూ ఆధునిక యుగమనీ తెలుగుభాషా చరిత్ర స్థూలంగా విభజించబడింది.

తెలుగుకంటె ఎంతో ముందు ప్రామాణిక సాహిత్యసృష్టి విలసిల్లింది. అంతేకాదు, ఆదేశభాషలలో రాజాజ్ఞప్తి వాహకాలయిన శాసనాలను నిలపడం కూడ తెలుగులో కంటె చాల పూర్వమనే చెప్పాలి. ఆయా భాషావ్యవహార ప్రాంతాలకు చెందిన రాజ్యపాలకులు దేశభాషా ప్రియులయినందు వల్ల ఇది సాధ్యపడింది. ధర్మం రాజానుమతం కాబట్టి ఆ నాటి పాలకుల ఆశ్రయంలోని కవిపండితులు దేశభాషలకు పట్టం గట్టారు; శాస్త్రచర్చలూ, సాహితీ గోష్ఠులూ దేశభాషల ముఖంగా ప్రవర్తిల్లాయి. రసవత్తరాలయిన మౌలిక కావ్యాలనేకం రచించబడ్డాయి. గీర్వాణ వాణీ రచనల స్థాయికి దీటు రాగల లాక్షణిక వాఙ్మయం ఎంతో వర్ధిల్లింది. ఆ పూర్వయుగాలలో జైన బౌద్ధమత ప్రచారకులయిన విద్వత్కవులు తెలుగులో సృష్టించిన సాహిత్యం కొన్ని కారణాలవల్ల నష్టమయి పోయి వుండవచ్చన్న కొందరి అభిప్రాయం తోసి రాజ నరానిది. ఏదియేమైనా ఆనాటి తెలుగు సాహిత్యసంపద మనదాకా సాగిరాలేదు. అందుచేత ఆనాటి భాషాస్వరూపనిరూపణం అరగొరగా, అసమగ్రంగా ఉండకతప్పదు.

సంస్కృత ప్రాకృత శాసన భాషా యుగానికి చెందిన సంస్కృత ప్రాకృత భాషా మయాలయిన శాసనాలలో అనేక సంజ్ఞావాచకాలు-వ్యక్తి నామాలూ కనిపిస్తున్నాయి. గోలశర్మ, దొడ్డిస్వామి, దొణశర్మ, మంచణ్ణ మొదలైన వ్యక్తినామాలూ, అంతుక్కూర, ఆచంట, ఉరువుపల్లి, ఏహూర, ఒంగోడు, కంగూర, కందుకూరు, కంటురాం చెరువు, కొండముడి, చెంచెఱువు, చెంపలూరు, తాన్తికొన్ద, పటికి, పెణుకపఱ్ఱు, ప్రాలుర, రావిరేవ, బెందలూరు, విటిపఱ, వేపుర-మున్నగు దేశిరూపాలయిన స్థలనామాలూ యీ

యుగంలో తెలుగుభాషఉనికికీ, మనికినీ తెలుపు తున్నవి. ఇంతకుమించి తెలుగుభాషకు సంబంధించిన విశేషాంశాలు తెలియడం లేదు. గోల ( <గోపాల), దొణ ( <ద్రోణ) శబ్దాలు తద్భవాలు. దొడ్డి, మంచణ్ణ దేశ్యాలు కావచ్చు. శర్మ, స్వామి తత్సమాలయిన పట్టపుపేర్లు. స్థలవాచకాల ఉత్తరభాగాన కనిపించే ఊరు, కోండ, చెరువు, పట్టు, పల్లి, ముడి, రేవు - మున్నగునవి నేడు కూడ గ్రామనామాల భాగాలుగా ప్రచురం.

ప్రాఙ్నన్నయ యుగం నాటి తెలుగు భాషా స్వరూపాన్ని నిరూపించడానికి అయుగానికి చెందిన నూరారు తెలుగు శాసనాలనూ, సంస్కృత ప్రాకృత శాసనాలలోని తెలుగు భాగాలనూ ఆధారంగా తీసుకో వలసి వుంటుందని యీ వరకే అనుకున్నాం. ఈ యుగం తెలుగు శాసనాలలో కొన్ని గద్యమయాలు; కొన్ని పద్యమయాలు. కొన్ని ఉభయాత్మకాలు. స్వీకరించిన ఛందస్సులలోనూ, తొలిదశలో ఆటవెలది తరువోజ, తేటగీతి, మధ్యాక్కర, సీసం మున్నగు దేశీయచ్ఛందాలు ఎక్కువగా వాడుకచేయబడ్డాయి. రాను రాను, సంస్కృత లక్షణంలో కనిపించని యతి ప్రాసల బిగింపుగల చంపకోత్పలమాలలూ, మత్తేభాలూ వాడుకలోకి వచ్చాయి. సంస్కృతంలో రచించిన వృత్తాలు కొన్నింట యతిప్రాసల వినియోగం ఉండడం గమనించదగిన విశేషం. పండరంగని అద్దంకి శాస నంలో తరువోజ, యుద్ధమల్లుని బెజవాడ శాసనంలో మధ్యాక్కర, గుణగ విజయాదిత్యుని కందుకూరి శాసనంలోనూ, పండరంగని ధర్మవరం శాసనంలోనూ సీసమూ. ఎత్తుగీతలో ఆటవెలదిగాని, తేటగీతిగాని ఉపయోగించబడ్డాయి.

వర్ణమాల విషయంగా 'టి' కారం ఉనికి ఒక విశిష్టత. ఏటువేలు (= ఏడువేలు), పుటోలు (= ప్రోలు), తాటి (= తాడి), టెందులూరు (= దెందులూరు)- వంటి రూపాలలో కనిపించే 'టి' కారం ఆ తరువాతి యుగాలలో ఉచ్చారణలో లేక పోయినా, కావ్యభాషలో కన్పించక పోయినా తెలుగు శాసనాలలో క్రీ శ. పదమూడో శతాబ్దివాకా లేఖన చిహ్నంగా నిలిచివుంది. పండరంగు మున్నగు సంజ్ఞా వాచకాలలో మహకవచన ప్రత్యయమే లేదు. చామియున్, త్రిభువనాదిత్యన్, శ్రీమహేంద్రన్-వంటి రూపాలలో తమిళంతో అభిన్నమయిన నకారం మహ దేకవచన ప్రత్యయంగా ప్రయుక్తమయింది. వాన్డు (వాఁడు), మగన్డు (మగఁడు = కుమారుడు), పుణ్య కుమారున్డు, గన్యమానున్డు-లలోని -'న్డు' నేటి డుజ్వర్ణకానికి తొలిరూపం.

ఈ యుగం తొలిదశలో దేశ్యపదాలపాలు అధి కంగా ఉండేది. మలిదశలో క్రమక్రమంగా సంస్కృత ప్రభావం హెచ్చుపెరిగింది. రెండు దశలలోని మొత్తం పదజాలాన్ని విశ్లేషిస్తే ఉజ్జాయింపుగా సగం దేశ్యాలు, మూడింట ఒకవంతు తత్సమాలూ, ఆరింట ఒకవంతు తద్భవాలూ ఉన్నట్టు లెక్కతేలుతుంది. అమృతపది, చౌషష్టి, జీవితమూడ, పోర్మఖరామ, రాచ మానంబు-వంటి మిశ్రసమాసాలు కూడ ఎడనెడ ఎదు రవుతుంటాయి 'అనేక సమర సంఘట్టన భుజాసి భాసురుండు', 'అనేక రిపున్నృపతి మణిమకుట మకరికా కషణమసృణిత...' 'సిమదారాతి మత్తమాతంగ మస్తక స్థలవిదారణఖరనఖర పంజర...'- వంటి సుదీర్ఘ సంస్కృతసమాసరచన క్వాచిత్కంగా కనిపిస్తుంది.

వాక్యరచనాపరంగా దేశీయలక్షణాలే యెక్కు వగా గోచరించినా అక్కడక్కడ సంస్కృత ముద్ర సైతం ద్యోతకమవుతుంది. 'చేయంబదిన ధర్మువుల', 'వైదుంబుళ చేతంబట్టం కట్టబడి'-వంటి కర్మణి ప్ర యోగాలనూ, 'నీకేమి వలయుందాని వేండికొమ్ము', 'వేంగినాంటి కెవ్వరు రాజులైరి వారుం బూర్వస్థితిం దప్పకపాలించువారు'-అన్నయత్తదర్థకప్రయోగాలనూ

విశేష్యవిశేషణాలకు లింగవచన విభక్తి వచనాలలో ఏకరూపతగల 'చాలుక్యభీమునకు వేంగీశ్వరునకు' వంటి ప్రయోగఫక్కీకా ప్రభావానికి ఉదాహరణలుగా ప్రదర్శించవచ్చు.

శాసన వాఙ్మయంలోని శైలిని మచ్చుకు కొంత అనుశీలించండి. '... కుసుమాయుధు పెద్దకొడుకు రాజ్యంబు సేయుచు నిష్టవిషయ కామభోగంబు లనుభవించుచు సుఖంబుండి యొక్కనాండు కొరవినల్లి మేజెయ కొడుకు పెద్దన రావించి నీవునా ప్రాణసమానండవైన చెలివినీ చేసిన యుపకారంబునకుం బ్రత్యుపకారంబు సేయవలయుం గాన నీ కేమి వలయుం దాని వేండి కొమ్మన్న....' కొరవి శాసనంలోని హృద్యమయిన యోగద్యధణితి నూరునూట యేభై యేళ్ళ తరువాతి నన్నయాదుల పదసరచనకు బజ్జబంతిగా ఉందనడం స్వభావోక్తి.

ప్రాఙ్నన్నయ యుగానికి చెందిన తెలుగుభాష ద్రవస్థితిలో ఉండేదనీ, దానికి స్థిరరూపమంటూ ఏర్పడలేదనీ,మహాకావ్యరచనకు యోగ్యమయిన ఉదాత్తస్థాయికి అదిచేరుకోలేదనీ కొందరు విపరీత ప్రతిపాదనలు చేస్తుంటారు. ఇట్టివి వట్టి ఊహాపోహలే కాని నిశిత పరీక్షకు నిలిచే వాదాలుకావు. అవకాశాలను బట్టి, ఆవశ్యకాలను బట్టే భాష యెదుగుతుంది. అది నీటి కొలది తామర!

T.Donappa
Nagarjuna Uniyersity,
Nagarjuna nagar-522 510

అమెరికాలో డాలర్లు పండును
ఇండియాలో సంతానం పండును
భూమి తన చుట్టూ తాను తిరుగుతూ
ధనవంతుడి చుట్టూ తిరుగుతోంది
దరిద్రం సముద్రంలో వేదనల తెరచాపలెత్తి
ప్రయాణించే జీవన నౌకలకి మృత్యువే లైట్‌హౌస్
ఆశ ఉత్తర ధ్రువం, విధి దక్షిణ ధ్రువం
మనిషి రెండింటి మధ్య బంతిలా ఎగిరిపడే ప్రహసనం!

-బాలగంగాధర తిలక్

# యతి పరిశీలనము

-ఎన్. ఎస్. రాజు

ఉచ్చారణలోని సామ్యధర్మము సాధారణముగ గొని రెండు వర్ణములకు మైత్రి చెప్పదగును. ఇట్టి మైత్రియే యతిమైత్రికి ప్రాతిపదిక. యతి మైత్రుల యందు ఒకే విధమైన లక్షణములుగల కొన్ని వర్ణములు ఒక మైత్రి వర్గమగును. వివిధములైన లక్షణములుగల వర్ణములు భిన్న మైత్రి వర్గములుగ నేర్పడి యతిభేద విభజనమునకు హేతువగును. స్వర వ్యంజనములు అక్షరాంగములగుటచేత స్వరవ్యంజనములు రెంటికిని మైత్రి చెప్పబడును. స్వరముల మైత్రిచెప్పునవి స్వరయతులు. వ్యంజనముల మైత్రి చెప్పునవి వ్యంజనయతులు. యతిమైత్రి నిర్వహణమున కేవల స్వరయతులు ప్రయోగింపబడునుకాని, కేవల వ్యంజనయతులు ప్రయోగార్హములు కావు. పద, వాక్య మధ్యములందు కేవల వ్యంజనమునకు స్థానము లేక పోవుటయే దీనికి కారణము. వ్యంజన మైత్రి స్వర మైత్రితో కూడియే పర్యవసించుచున్నది దీనిని బట్టి యతిమైత్రి పాలనమున స్వరయతి, ప్రాణియతి యని రెండు తెఱగులైన విధానములుండునని తెలియుచున్నది. ఇచ్చట ప్రాణియతి యనిన స్వరహల్సంయోగమైన ప్రాణికి కూర్చు యతిమైత్రి యని నిర్ణయము.

సర్వసహితమైన ఒక వ్యంజనమునకు మిత్ర స్వర సహితమైన ఆదే వ్యంజనముతో మైత్రి కూర్చుట ప్రాణియతియని అప్పకవీయ లక్షణము. అందు వ్యంజన మైత్రులు వర్గజయతి, బిందుయతి మొదలుగాగల యతుల మూలమున ప్రకటింపబడినవి స్వరమైత్రి లేకుండగ వ్యంజనయతులు చెల్లవనెడి ప్రధానలక్షణమును ప్రకటించుటయే, ప్రాణియతిని చెప్పుటలోగల అప్పకవి ముఖ్యోద్దేశము. కాని స్వరమైత్రి కల్గియున్నచో ఒక వ్యంజనమున కదే వ్యంజనముతో చెల్లు యతి ప్రాణియతి యని చెప్పుటలో విశేషము లేదు. స్వరహల్సంయోగమైన ప్రాణులు రెంటికి మైత్రి చెప్పబడినచో దానిని ప్రాణియతి యనుటలోనే విశేషము కలదు. ప్రాణియతులు లక్షణమునందు వ్యంజనములుగా చెప్పబడినట్లు గుర్తింపనగును.

ఏవేని రెండుకాని అంతకంటె ఎక్కువకాని వర్ణములకు సామ్య ధర్మమారోపించి మైత్రి చెప్పిన ఒక యతిమైత్రి ఏర్పడును. అప్పకవీయమైత్రి సూచక యతుల' నదగును. యతిమైత్రి పాటింపవలసిన అక్షరము సంధిగతమైనచో నా సంధిస్థానమునగల పూర్వపదాంతగమును, ఉత్తరపదాదిగను ( అంత్యోష్మ సంధివడి-ఉద్ధతి> త్ + హతి), ఆదేశము (వృద్ధి వళి-లోకైక> లోక + ఏక) నైన వర్ణములలో వేనికి మైత్రి కూర్పదగుననెడి నియమమును సూచించు యతులనుకూడ లాక్షణికులు యతిభేదములుగ పరిగణించిరి. ఈ యతులలో యతి స్థానముగల మైత్రి చెల్లింపదగిన వర్ణములు ప్రకటింపబడుచున్నవి. కావున అప్పకవీయ మందలి యిట్టి యతులను 'స్వర ప్రధానవళి, వికల్ప యతి మొ॥) యతి భేదములుగ పరిగణించుట కంటె 'నియమ సూచక యతుల'ను ప్రత్యేక వర్గముగ తెలుపుట సమంజసము. నిజమునకు మైత్రి సూచక యతులనే యతిభేదములన వలసి యున్నది. నియమ సూచక యతులు యతిభేదములు కాజాలవు,

యతి మైత్రి పాటింపవలసిన యక్షరము స్వర సంధిగతమైన యెడల, అచ్చట స్వరయతికాని వ్యంజన

యతి కాని వేయ వచ్చుననెడి నియమమును తెలుపునది ఉభయయతి. సాధారణముగ ఏకశబ్దమువలె ఒప్పు నిత్యసమాసాది శబ్దములందే ఉభయయతి చెల్లును. ఏకశబ్దమువలె భాసింపకున్నను స్వరసంధితో కూడియున్న శబ్దయుగళము నఖండముగ స్వీకరించి వ్యంజన యతి కూర్చుట అఖండయతి యన బడును.అప్పకవి అఖండయతిని సర్వత్ర సమ్మతింపని వాడగుట వలన, శబ్దాను శాసన ప్రభృతి పూర్వ కవి జనముల కృతుల లక్ష్యములను పరిశీలించి, స్వర వ్యంజనోభయ యతులు చెల్లిన పదములను స్వీకరించి, పంౘెండు విధములైన ఉభయ యతులను చెప్పినాడు ఈతడు చెప్పిన యుష్మదస్మచ్ఛబ్దయతి నిజమున కఖండ యతియే. యుష్మదాజ్ఞ, అస్మదన్వయము వంటి పదములు ఏకశబ్దమువలె కాక శబ్దద్వయ మేళనముగ ప్రస్ఫుటముగ కనబడునట్టివి. యుష్మదస్మచ్ఛబ్ద యతి అఖండయతియే కాని వేరుకాదనెడి యభిప్రాయమును వెల్లంకి తాతంభట్టు. కూచిమంచి వేంకటరాయకవి ప్రకటించిరి అఖండ యతి పట్ల వైముఖ్యముగల అప్పకవి, అఖండయతి కల యుష్మదస్మచ్ఛబ్దములు నన్నయాదుల కావ్యములందుండుట వలన అంగీకరింపవలసి వచ్చి, ప్రత్యేకమైన యతిగా స్వీకరించి ఉభయవళులలో చేర్చినాడు అఖండ యతి చెల్ల దగిన పదములలో స్వరయతి వేయుట సామాన్యమగుటచే అఖండ యతియు ఉభయ యతియే అగుచున్నది. కావున ఉభయ యతి పాటింపదగిన పద జాలమును సూచించుట కంటె అంఖడయతి నొక్కదానిని చెప్పిన యెడల నందే ఉభయ యతియు నంతర్గతమగును. కాని ఏక శబ్దము వలె తోపకున్నను స్వర సంధిజరుగు సర్వ పదద్వయ మేళనము నందును వ్యంజన యతి యంతరమ్యముగ దోపక పోవుటచే నట్టి చోట్ల కేవల స్వరయతులే పాటించుట యుక్తమనియు, వ్యంజన యతులు కూర్పరాదనియు అప్పకవ్యాదులు భావించిరి. కావున అఖండయతి పట్ల లాక్షణికులు పాక్షిక వైముఖ్యము వహించి స్వర వ్యంజ నోభయములకు యతి చెల్లింప దగిన పదములను ప్రత్యేకముగ ఉభయయతులను శీర్షిక క్రింద చేర్చి యున్నారు. ఎంతటి సామ్యము న్నను ఉభయాఖండాయతులలో గల సూక్ష్మ భేద మును గుర్తించి రెంటిని వేరు చేసి భిన్నమైన యతులుగా ప్రదర్శించుటయె సమంజసము. అప్పకవి ద్వాదశ విధములైన ఉభయయతులను చెప్పెను. వీని యందు విషయ విస్తరణమేకాని నూత్న విషయ ప్రతిపాదనములేదు. ఒక్క ఉభయయతిని చెప్పిన వీనినన్నిటిని చెప్పినట్లెయగును. అఖండయతిలోను, ఉభయ యతిలోను యతి చెల్లింపవలసిన నియతి చెప్పబడుటచే వీనిని నియమ సూచక యతులుగా స్వీకరింప వలసి యున్నది.

స్వరవ్యంజనములకగు సంధి యందేకాక, వ్యంజనద్వయమునకగు సంధియందును పాటింపదగు యతిని ఉభయయతి యన దగుననెడి యభిప్రాయ మొకటి యర్వాచీన కాలమునందేర్పడెను. ఇచ్చటొక విషయము గమనింపవలెను. స్వరము, వ్యంజనము అనునవి వర్ణములలోగల ప్రధానమైన రెండు భిన్న వర్గములకు సంకేతములు. ఏ వేని ఒక స్వరమును, ఒక వ్యంజనమును సంధిల్లినప్పుడు కొన్ని పదములలో రెండింటికిని విడివిడిగా యతి మైత్రి కూర్పదగును. అనగా కేవల స్వరయతికాని, వ్యంజనయతికాని చెల్లింప దగును. ఇట్టి స్వర వ్యంజన సంధిగతాక్షరమునకు కూర్చుయతిని ఉభయయతి యనుట సమంజసమును సంప్రదాయమునయ్యెను. వ్యంజన ద్వయము యొక్క సంధి గతాక్షరమునకు కూర్చు యతిమైత్రి యందు స్వరయతి యొక్క ప్రస్తావము లేదు. ఇందు కూర్ప దగు యతులు వ్యంజనయతు లగుటవలన వీనినిఉభయ యతులందు చెప్పుటలో సామంజస్యము లేదు. పిదప స్వరవ్యంజన సంధి యందలి యతినియమమును ప్రకటింపవలసిన యావశ్యకము, ప్రాముఖ్యము కలిగి నట్టిది. అనగా అఖండయతి ఘనాంగీకారమగుటచే

ఎట్టిచోట్ల స్వరవ్యంజనోభయ యతులు అంగీకరింప దగినచో తెలుపుట కర్తవ్యమైన యవి ఉభయయతులను పేర వచింపబడినవి. వ్యంజన ద్వయమునకగు సంధి యందు పూర్వ పర వ్యంజనములను ఉభయ శబ్దము నకు సంకేతముగ గ్రహించినప్పటికిని, వానిలో దేని కైనను యతిమైత్రి కూర్పదగియుండుట సామాన్య మైన విషయమగుటచే నిట్టి సంధియందు ఉభయయతిని ప్రత్యేకించి చెప్పవలసిన ఆవశ్యకము లేదు. అయినను ఇట్టి యతినికూడ ఉభయయతి యనదగుననెడి యభి ప్రాయము కలవాడైన కూచిమంచి వేంకటరాయకవి, అప్పకవి వ్యంజనయతులలో చెప్పిన వికల్ప వివరణము (దిక్ + మహితుడు), అంతోష్మసంధి (వాక్ + హరి) వదులను ఉభయయతులతో చేర్చినాడు.

ప్రాసయతియందు వళిమైత్రి చెప్పబడక, ప్రాస విశేషముద్వారా యతిలక్షణము సాధింపబడుచున్నది. అనగా యతిస్థానమందు ఆద్యక్షర వళిమైత్రి చెల్లక పోవుటవలన, దాని తరువాత యక్షరముతో పాదాన నున్న ప్రాసాక్షరము ప్రాసమైత్రిని కల్గియుండును. పద్యముయొక్క అన్ని పాదములలోని ద్వితీయాక్షర ములు (నిలువుగ) మైత్రి కల్గియున్నచో 'ప్రాస' యనియు; ఒక పాదముయొక్క ద్వితీయాక్షరము అదే పాదమునగల యతిస్థానమునకు తరువాతనున్న యక్ష రముతో (అడ్డముగ) మైత్రి కల్గియున్నచో 'ప్రాస యతి' యనియు వ్యవహారము. నిజమున కీరెంటికిని నామమునందు స్వరూపమునందు భేదమేకాని లక్షణము నందు భేదము లేదు. పద్యములోని పాదాదినిగల ద్వితీయాక్షరమైత్రిని సాధారణముగ ప్రాసమని వ్యవ హరించినప్పుడు, యతి స్థానమునగల ద్వితీయాక్షర మైత్రిని 'యతిప్రాస'మని వ్యవహరించుట యుక్తము. కావున దీనిని ప్రాసభేదములందు పరామర్శించుట సమంజసము.

## అనావశ్యకమైన యతులు :

య, హ లకు అకారముతోను; క,ష,స లకు చ, ఛ,జ,ఝ ల తోను మైత్రి సరసయతియందు చెప్పబడి యుండగా ప్రత్యేకించి య, హ లమైత్రి ఋజుయతి యనియు, శ, ష, స లమైత్రి ఊష్మయతియనియు చెప్పుట పునరుక్తి యగుచున్నది. ఇట్లు చెప్పుటయం దెట్టి విశేషము లేకపోవుటచే ఋజూష్మయతులు రెండు ననావశ్యకమగుచున్నవి.

పు, పు, బు, భు, ము లకు యతిమైత్రి కలదు. ఇందలి ముకారము విభక్తి ముకారమైన యెడల ము విభక్తి యతియనియు, సాధారణ ముకారమైన యెడల ముకారయతియనియు అప్పకవి రెండు యతులుగ చెప్పెను. ముకారము విభక్తి ప్రత్యయమైనను, సహజ ముకారమైనను యతిమైత్రి చెల్లుటయందు భేదమేమి యును లేదు. ఒక్క ముకారయతి చెప్పిన అందే మువిభక్తి యతియునంతర్గత మగును. కావున రెండు యతులుగ విభజించుట వ్యర్థమగుటచే మువిభక్తి యతి చెప్పుట యనావశ్యకము.

ఆ భేద నిరతియందు వ, బలకు మైత్రిచెప్పబడి దాని వెనువెంటనే ప, ఫ, బ, భ, వ లమైత్రి అభేద వర్గయతియని చెప్పబడినది. వ్యంజనయతులలో తొలు దొల్త చెప్పదగిన వర్గజయతిప్రకారము ప,ఫ,బ,భ,ల మైత్రి నిరూపితమైనది. దీని ననుసరించి అభేదయతిలో వ, బ లకు మైత్రి చెప్పిన వీనితోపాటు ప, ఫ,భ లకు కూడను చెప్పినట్లే యగుచున్నది. కావున అభేద, అభేదవర్గ యతులను సమీకరించి ఒక్క అభేద విర తిని చెప్పుట యుచితము. కాగా అభేదవర్గయతి యనా వశ్యకమగును.

'ధరియించు' వంటి రూపములతో స్వర యతి, 'ధరించు' వంటి రూపములలో వ్యంజనయతి పాటించు టను భిన్నయతి యనియు, అట్లె 'చేతియది' వంటి రూపములలో స్వరయతి, 'చేతిది' వంటి రూపములలో

వ్యంజనయతి పాటించుటను ప్రత్యేకయతి యనియు అప్పకవి రెండు విధములగు యతులను చెప్పెను. సంధి చేయబడిన రూపములలోను క్రమముగ స్వర వ్యంజనయతులు చెల్లుటనుబట్టి; సంధి కావింపబడిన 'ధరించి, చేతిది' వంటి రూపములలో స్వరయతి వారింపనెంచ భిన్నముచేయబడిన అనగా సంధిలేని రూపములందు మాత్రమే స్వరయతి చెల్లునని చెప్ప దలచుటయే ఈ యతుల ప్రయోజనము. మొదటిదాని యందు ఇకారమును, రెండవదానియందు అకారమును పరపదాది స్వరమగుచున్నది. ఇట్టి స్వల్పభేదముతప్ప రెండు యతులుగ చెప్పుటయందు విశేషము లేకపోవు టచే రెండింటినికలిపి ఒక్క భిన్నయతియందే చెప్ప దగును. ప్రత్యేకయతి చెప్పుటలో ప్రత్యేకతలేమిచే నిది యనావశ్యకమగును. తదుపరి ధరించు, 'చేతిది వంటి రూపములలో కేవల స్వరయతి నిషిద్ధమని చెప్పుటయే భిన్నయతియొక్క ప్రయోజనమగుటవలన దీనినొక యతిగా చెప్పనవసరములేదు. కాగా భిన్నయతిని అ|గా హ్యావళులలో పరామర్శించుట యుక్తము.

వర్గాక్షరములకు అనునాసకములు పరమగుచో తత్తద్వర్గాంతానునాసికము వైకల్పికముగ నాదేశ మగుననెడి వ్యాకరణ విధిచే హృత్ + మధ్య— హృద్మధ్య,అనెడి రూపము లేర్పడుచున్నవి. వైకల్పిక సంధివలన రెండు రూపము లేర్పడుటచే వీని అక్ష రముల యొక్క యతినియతి వికల్ప విరమణమని చెప్పబడినది. అనునాసికేతరములైన వర్గ హల్లులకు హకారము పరమగుచో, దాని కావర్గ హల్లు యొక్క స వర్గము వైకల్పికముగ నాదేశమగుననెడి వ్యాకరణ విధిచే వాక్ + హరి— వాగ్ఘరి, వాగ్ హరి అనెడి రూపము లేర్పడుచున్నవి. అంత్యోష్మము పరముకాగా వైకల్పికసంధిచే నేర్పడు రూపద్వయము యొక్క సంధిగతాక్షరములకు పాటింపవలసిన యతినియిది అంత్యోష్మసంధినడియని చెప్పబడినది. ఈ రెండు విధములైన సంధులలోను వ్యాకరణ భిన్నమైనను సంధివైకల్పికమగుటచేత రెండేసి రూపము లేర్పడుట యను సామ్యముకలదు. కావున నీరెంటిని సమన్వయ పరచి పూర్వ, పర, ఆదేశ వర్ణములు మూడింటికిని యతి చెల్లింపవచ్చు, ననెడి నియమమును ఒకే యతి యందు చెప్పనగును. రెండు సంధులును వికల్ప సంధులగుటచేత దానిని వికల్ప విరమణమని చెప్పి నచో రెండవది యనావశ్యకమగును.

ఇట్టి విధమైన పరిశీలనముచే అప్పకవీయ యతు లను ఈ దిగువ రీతిని వింగడించి చూపనగును:

| మైత్రి సూచక యతులు | నియమసూచక యతులు |
| --- | --- |
| **స్వరయతులు** | |
| 1. స్వరమైత్రి వళి | 1. స్వరప్రధానవళి |
| 2. ఋ వళి | 2. లుప్త విసర్గక స్వరవళి |
| 3 ఋత్వసంబంధవళి | 3. వృద్ధివళి |
| | 4. ఋత్వసామ్యవళి |
| **వ్యంజన యతులు** | |
| 4. వర్గజ యతి | 5. ప్రాసయతి |
| 5. బిందుయతి | 6. సంయుక్తాక్షరయతి |
| 6, సరసయతి | 7. ఏకతరయతి |

7. అనునాసికాక్షరయతి
8. అనుస్వారసంబంధయతి
9. తద్భవవ్యాజయతి
10. విశేషయతి
11. ముకారయతి
12. మవర్ణవిరామము
13. అభేదయతి

8. వికల్పయతి
9. ఉభయ యతి
(ఇంది పన్నెండు విధములు)
10. భిన్నయతి
(అగ్రాహ్యములలో చేర్పదగినది)
11. ప్రాసయతి
(ప్రాసభేదములలో చెప్పదగినది)

అనావశ్యకమైన యతులు

14. ఋజుయతి
15. ఊష్మయతి
16. ముపిభక్తియతి
17. అభేదవర్గయతి

12. ప్రత్యేకయతి
13. అంత్యోష్మసంధిపది.



## క్రొత్తగా చెప్పవలసిన యతిమైత్రులు

భాష సహజమైన వ్యవహారస్వరూపము కలది. వ్యాకరణము భాషను వ్యాకరించునది యగుటచే నది ప్రయోగశరణ్యమైనది. కవిత్వము భాషా నిర్మాణ మయ్యును కవి యొక్క భావసౌధమగుటచేత భాషలోని సహజ గుణములతోపాటు కల్పనా రామణీయకమును కూడ కలిగి యుండును. కావున ఛందశ్శాస్త్రమునందు కావ్యము యొక్క మూల ధర్మములతోపాటు. శాస్త్రసమ్మతమై కళోద్దీప్తికి దోహద పడు నూత్న సిద్ధాంతములు కూడ నుండును. దీనిచే కవులకు ప్రయోగ సౌలభ్యమును. కవితాకళకు నూతన శోభయు చేకూరును. అనగా ఛందశ్శాస్త్రము నందు పలువిధములైన సూత్రములున్న యెడలనే కావ్యమును తద్గతమైన రసభావాదులను ప్రకటించునట్లుగ రచించుటకు సాధ్యపడును. కావున ఛందశ్శాస్త్రము కావ్యచ్ఛందమును ప్రకటించుటతోపాటు కావ్యరచనమున కుపకరించు పలువిధములైన లక్షణములను ప్రతి పాదింప సమర్థమునై యుండునని నిర్ణయింపవగును. దీనికి క్రింది విషయ మాలంబనము కాగలదు. పరిమితములైన వృత్తములనే మహాకవులు స్వీకరించి కావ్యములు రచించి యున్నప్పటికిని ఛందశ్శాస్త్ర మసంఖ్యాకమైన వృత్తములకు లక్షణములు చెప్పుచున్నది. వీని నుండి తమ తమ కావ్యగత భావముల కనువగు వృత్తముల నెన్నుకొనుటకు కవులకు స్వేచ్ఛకలదు. చెప్పవలసి వచ్చినచో లాక్షణికులు సూచించిన వృత్తములలో ప్రయోగ భాగ్యమందనివియే అత్యధిక సంఖ్యలో కలవు. లక్ష్యావిర్భావము తరువాతనే లక్షణ రచనము జరిగి యుండి నప్పటికిని శాస్త్రపరమైన హేతువులచే లక్షణవైపుల్య మేర్పడి కవులకు ప్రయోగ సౌలభ్యమధిక తరమగును.

ఈలాగుననే యతిమైత్రుల యొక్క లక్షణము లందును శాస్త్ర పరిధికి లోనైయుండు క్రొంగ్రొత్త యతులను చెప్పదగును. సందర్భౌచిత్యములను బట్టి యతిమైత్రి నిర్వహణము నందిట్టి విధమైన క్రొత్త యతులను పాటించుటకు కవికి అవకాశము కలుగును.

తద్ద్వారా కావ్యరచనమున సహజమును రసవంతమును శక్తిమంతమునైన పదప్రయోగము చేయుటకు వీలగుటచే నది లక్షణ గౌరవము కలిగి యుండును. దీనివలన కవితారచనమున యతిమైత్రి నిర్వహణమొక ప్రతిబంధకమను అపప్రథ తొలగి పోవును.

## ఇ ఈ ఎ ఏ-రి రీ రె రే ల మైత్రి

ఋకారముతో ఇఈఎఏ లు మైత్రి నొందునని స్వరపథావళియు, రిరీరెరే లు మైత్రి నొందునని ఋవళియు చెప్పుచున్నవి. ఈ రెండు విధములైన మైత్రులవలన ఇఈఎఏలకు రిరీరెరేలతో మైత్రి నంగీకరింపవలసి యున్నది. ఈ యతిమైత్రిని లాక్షణికులు చెప్పినట్లు లేదు. కాని పై మైత్రి నాధారముగ గొని యిట్టి మైత్రి చెల్లించుట సమంజసమగుటచే, దీనిని గుర్తించిన అనంతుడు లక్ష్యములు కానరామి కారణముచే '.... ఈ, ఏ లకుఁ దలఁ పగ రీలోడి విరతి తలకొన దెందున్' అని యీమైత్రిని ఖండించినాడు. ఈ మైత్రి చెల్లిన ప్రయోగములు పూర్వకావ్యములందు లేక పోవచ్చును గాని మైత్రిని మాత్రమంగీకరింపవలసి యున్నది. ఋత్వవిశిష్టమైన ఏవ్యంజనమున కైనను ఇకారస్వర వర్గము (ఇఈఋౠఎఏ)తో మైత్రి ఋత్వసంబంధ వళిచే అంగీకరింపబడి యుండగా స్వీయముగ ఋకారమునకు మిత్రములైన రిరీరెరేలతో ఇకారస్వర వర్గమునకు మైత్రి నేలకూర్పరాదు? ఇట్టి అభిప్రాయము కలవాడగుటవలన అనంతుడు, లక్ష్యములు లేవనెడి తలంపుతో నీ మైత్రి చెల్లక పోవుటకు గల కారణమును

> "తెల్లముగ ఋకారము యణా దేశ శక్తిఁ
> గలుగు రేఫ, యిత్వమునందుఁ గదిసి యతికి
> నట్టి రీ కి నీయేలతో నన్వయించు
>
> నట్టి సత్త్వంబు లేదది హల్లుగాన" - ఛందోదర్పణము

అని సమర్థించినాడు. తదుపరి ఋత్వసంబంధవళియందే ఇకారస్వర వర్గ విశిష్టమైన యహలును, వర్ణసుడితో కూడిన ఏ హ లైనను ఇకారస్వర వర్గముతో మైత్రి నొందునని చెప్పబడినది. అనగా ఇఈఋౠఎఏలు, యియీయృయ్యాయెయేలు హిహీహృహ్రూహెహేలు, కృ గృ ఇత్యాదులు మిత్రములు. ఇందలి యొక మైత్రికి సరసవళిలోని అయహల మైత్రి కారణము. ఈలాగుననే ఋ రి లమైత్రిచే ఇ రి లకును మైత్రి నంగీకరింప వలసి యున్నది.

ఋవళికి అప్పకవి చెప్పిన లక్షణము కొంత స్పష్టత కొరవడి యుండుటచేత నీ మైత్రిని లాక్షణికులే అంగీకరించి యున్నారని తలంచుట కవకాశమేర్పడుచున్నది. "ఇత్త్వైత్వంబులఁ దొలఁగక, ఋత్వంబును ఋవళి యనఁగ రేఫముతో మిత్రత్వంబు నెఱపు..." నని అప్పకవీయ లక్షణము (3-22). ఈ వాక్యము యొక్క భావమును, ఇఈఎఏలను కూడిన ఋకారము రేఫముతో మైత్రి నొందుట ఋవళి యనబడును అని సులభముగ చెప్పవచ్చును. కాని ఇఈఎఏలతో కూడిన రేఫముతో ఋకారము నకుమైత్రి కలదనుట ఋవళి యనబడునను క్లిష్టాన్వయమును లక్షణముగ చెప్పుట ప్రచారము నొందినది. ఇట్లు చెప్పుటకు ఋ రి లకు మాత్రమే యతిమైత్రి చెల్లిన ప్రయోగములుండుటయు, ఇఈ ఎఏలకు 'రి'తో మైత్రి చెల్లిన ప్రయోగములు లేకపోవుటయు కారణములు. పైలక్షణ పద్యమున గల 'తొలఁగక' అనుదానికి 'కలయక', 'బెరయక, అను రెండు పాఠాంతరములు కలవు.

ఈ పాఠములకు 'కలసియుండక', 'కూడక' అనునవి అర్థములగుటచేత ఇత్త్వైత్వములతో కూడి యుండని ఋకారము రేఫముతో మైత్రి నొందునని అన్వయము చెప్పిన ప్రస్తుత లక్షణమున కీపాఠములు బాధకములు కావు. దీనిని బట్టి ఋకారస్వరమునకు రకారవ్యంజనముతో మైత్రి చెల్లునని చెప్పవలసి వచ్చుటచేత, అదియంత శాస్త్రీయము కాదని యభిప్రాయ పడుటవలన 'తొలఁగక' అను పాఠమును

గ్రహించి ఇత్వైత్వముల దొలఁగక అనెడి దశమును రేఫమున కన్వయ వరచి లక్షణము చెప్పు విధానము వ్యాప్తి నొందినది. కాని ఋకారస్వరమును రేఫతో వడి గూర్చిన ఋత్వయతి యని లక్షణ శిరోమణి యిట్లు చెప్పుచున్నది:

"గరిమ స్వర రూపమైన ఋకారమునకు
రేఫతోఁగూడ వడి యొనరించిరేని
ఋత్వ యతి యననది యొప్పుఁ, గృతుల యందు
ఋషి మనోంబుజ మత్తద్వి, రేఫ కృష్ణ
—(4-233)

లక్షణ శిరోమణి యందు చూపబడిన చిత్రపుభీమన్న లక్షణము నందుకూడ యిట్లే చెప్పబడినది.

"అచ్చులలోని ఋకారం
బచ్చుపడన్ రేఫతోడ, ననువైన యెడన్
చెచ్చెర వడిగా నిలుపుట
పొచ్చెముగా దాది కావ్యముల మున్నెనికిన్"
—(4- 34)

కావున ఋకారమునకు రేఫతో మైత్రి కలదనినచో ఋకారమునకు మిత్రములైన స్వరములతో కూడిన రేఫమునే గ్రహింప వలెనని పైలక్షణములను బట్టి నిర్ణయమగు చున్నది. ఈలాగున స్వీకరించినచో ఇఈ ఎఏలు లే కుండగ ఋకారమొక్కటియే రిరీరెరే లతో మైత్రి నొందుననెడి లక్షణమునకు "ఇత్వైత్వంబులఁ గలయక (బెరయక) ఋత్వంబును, ఋవళి యవఁగ రేఫముతో...." అను వాక్యమును అప్పకవి చెప్పిన సరియైన పాఠముగా గ్రహింపవలసి యున్నది. "ఇత్వైత్వంబులఁ దొలఁగక...." అను పాఠమును స్వీకరించినచో లక్ష్యములను బట్టి అన్వయమును కల్పింప వలసి యున్నది. లేనిచో ఇత్వైత్వములతో కూడిన ఋకారమునకు రేఫముతో మైత్రి కలదని అప్పకవియే చెప్పినట్లు భావింపవలసి యున్నది.

ఋకారము యొక్క రేఫతుల్యత్వము చేత 'ఈశ్వర ద్రోహి గర్వాంధ ఋషి వరేణ్య' (కాశీ ఖండము 7-96) మొదలుగాగల యతియతులందు ఋకార స్థానమున రేఫమే వినబడుచున్నది. ఋషికి రిసి యని రూపాంతరము కలదు. ఇట్టి తావులలో ఈ- 8 లకు యతిమైత్రి చెల్లించినట్లె యగుచున్నది. ఈకారణముచే ఋకార మిత్రములైన ఇత్వైత్వములకు రిరీ రెరే లతో మైత్రి నంగీకరించుట సమంజసమగు చున్నది. ఇట్టి మైత్రి చెల్లిన ప్రయోగములు పూర్వ కావ్యములందు కనబడక పోయినప్పటికిని చెల్లుట యందు సహజముండుటచే ఆధునిక కావ్యములం దచ్చటచ్చట కనబడుచున్నది.

మహాకవి విశ్వనాథ సత్యనారాయణగారి శ్రీమద్రామాయణ కల్పవృక్షము నందలి లక్ష్యము: "క నే వాని కొంప కాల్చితి, న్వీని కులాంగనన్ హ రించితి నివియా! ----." (జటాయు: ఖండము- 400) (అరణ్యకాండము- పంచమ ముద్రణము). అందలి 'హరించితి' అను పదము 'వహించితి' అను పాఠాంతరముతో ద్వితీయ ముద్రణమున కలదు, ఔర్థౌచిత్యమునుబట్టి యర్వాచీన ప్రతిలోని పాఠమును ప్రమాణముగా స్వీకరింపవలసి యుండుటచే విశ్వనాథ వారు ఇఈ ఎఏ రిరీ రెరే ల యతిమైత్రి నంగీకరించి నట్లు తెలియుచున్నది.

ఆచార్య శ్రీ భారతిగారి 'నాగార్జునసాగర్' కావ్యమునందలి లక్ష్యము: ఉ। ని, ర్మింపజలాశయంబు మదినెంచిరి లోకహితార్థమేర్పడన్.

(60 వ పద్యము)-

## 2) లి లీ లె లే లమైత్రి

ర,ల లయతిమైత్రి అప్పకవి కంగీకరముకాదు. ఉచ్చారణము నందీ రెండక్షరములు సామ్యధర్మములను కల్గియుండుటచే నభేదతను కల్గియున్నవి. 'రలయోర భేదః' అని ప్రమాణము రోలంబ-లోలంబ, రేఖా-

లేఖా అనెడి రూపద్వైవిధ్యమును అప్పకవి సమ్మతించి రల యతి మైత్రి మాత్రము చెల్లుననెను. ఈ రూపద్వైవిధ్యమునకుగల హేతువే ర, ల లయతిమైత్రి చెల్లుటకును హేతువగు చున్నది. ప్రాచీనార్వాచీన కావ్యములందీ యతిమైత్రి విరివిగ పాటింపబడుటచే లింగమగుంట తిమ్మన, పొత్తపి వేంకటరమణకవి, ఈంగ కవి, కూచిమంచి వేంకటరాయకవి మొదలగువారు ర,ల యతిని తమ తమ లక్షణ గ్రంథములందు చెప్పి యున్నారు. కావున ర-ల లకు మైత్రి చెల్లునని నిర్ణయము.

ఈ మైత్రి నాధారముగగొని ఋ-ఌ లకు యతి మైత్రి చెప్పనగును. ఋకారముతో రేఫము (రి) నకు మైత్రి చెల్లుట (ఋవలి) వలన, రేఫమునకు మిత్రమైన లకారము (లి) నకును మైత్రి నంగీకరింపవలసి యున్నది. అనగా ఋకారమునకు లిలీ లెలే లతో యతి మైత్రి కూర్పవచ్చును. ఇట్టి మైత్రి చెల్లిన ప్రయోగములు లేకపోవచ్చును కాని మైత్రి చెల్లుట సహజము.

స్వీయ లక్ష్యము :- ఋషివరేణ్యులుజూచెడి/లీలలెల్ల.

'ఞ న ణ' లకు యతిమైత్రి చెల్లునని తద్భవవ్యాజ విశ్రామము చెప్పుచున్నది, ఈ అక్షరముల లోని అనునాసిక్యధర్మమే ఈ మైత్రి చెల్లుటకు హేతువు. కావున అనునాసికములైన 'ఞ ణ న'లకు మైత్రి నంగీకరింపవలసియున్నది. ఇందలి 'ణ న'ల యతిమైత్రి (సరసయతి) ప్రసిద్ధమైనట్టిది. వర్గములోని తొలి నాల్గక్షరములు బిందు పూర్వములైనచో తత్తద్వర్గాను నాసికముతో యతిమైత్రి చెల్లునని బిందు యతి చెప్పుచున్నది. ణ, న లకు చెందిన ట, త వర్గముల పరస్పర మైత్రులు అనుస్వార సంబంధ (ంట, ంఠ, ండ, ంఢ, -ంత, ంథ, ంద, ంధ) అనునాసికాక్షర (ంట, ంఠ, ండ, ంఢ,-న; ంత, ంథ, ంద, ంజ-ణ) యతుల మూలమున నిరూపింపబడినవి. ణ,న లకు ఞ కారముతో అనునాసిక్యధర్మముచే మైత్రి నంగీకరించుట వలన ట, త వర్గములకు చెందిన పరస్పర మైత్రులందు ఞ కారమునకు చెందిన చ వర్గమునకును మైత్రిని చెప్పవలసియున్నది. దీనినిబట్టి ఈ దిగువ మైత్రులు చెప్పదగును.

## 3) ంచ, ంఛ, ంజ, ంఝ-ఞ న ల మైత్రి:-

చ వర్గములోని తొలి నాల్గక్షరములు బిందు పూర్వకములైనచో ఞ, న లతో మైత్రి చెల్లును. దీనిని అనునాసికాక్షరయతి యందు చెప్పదగును. ఈయతి మైత్రి చెల్లిన లక్ష్యములు పూర్వకావ్యములందు మృగ్యములు. అర్వాచీన కావ్యమగు సౌందరనందము నందు మైత్రి చెల్లిన ప్రయోగ మొకటి కనబడుచున్నది.

సీ॥ నీదునెమ్మోము గాంచెడి యదృష్టముగోలు
పోలిక కన్గవ మూయవెఱచి (నిరీక్షణము-88)

## 4. ంట,ంఠ,ండ,ంఢ,ంత,ంథ,ంద,ంధ- ఞ జ్ఞ ల మైత్రి:-

ట, తవర్గముల తొలినాల్గేసి యక్షరములు బిందు పూర్వకములైనచో 'ఞ,జ్ఞ'లతో మైత్రి చెల్లును. దీనిని కూడ అనునాసికాక్షర యతి యందు చెప్పదగును. ఇందలి బిందు పూర్వక త వర్గునకు జ్ఞా తో మైత్రి చెల్లునని లక్షణ శిరోమణి(4-114) యందు చెప్పబడినది. దీనికి ప్రయోగ బాహుళ్యము లేకపోవుటచే శిరోమణి కారుడు దీనినొక విశేషమని చెప్పి వరాహపురాణము నుండి యీ దిగువ పద్యము నుదాహరించి యందలి 'ంద-జ్ఞ'లకు యతిమైత్రి చెల్లుటను ప్రదర్శించినాడు.

మ॥ అనిగౌరీపతికిన్ భవానికిని నా। హ్లాదంబుగాఁ బల్కెవే
చని లోకైకపితా మహున్నయివ నా। స్థానంబులో నుండఁగాఁ
గని దేవా శశిఖండ మౌళికి సుమం। గల్యాణి నా కూర్మినం
దన పీవాత్మఁదలంచి దేవరకు వి। జ్ఞాపింప నేతెంచితిన్.

-లక్షణ శిరోమణి (4-115)

ముద్రిత వరాహపురాణము నందలి పద్యము కానరాక పోవుటకు, అప్పకవీయ యతులచే నందలి "ంచ-ఞ్జ" లకు చెల్లిన యతి మైత్రి సమర్థింపబడక పోవుటయు నొక కారణమై యుండ వచ్చును.

5) ంచ, ంఛ, ంజ, ంఝ-ంట, ంఠ, ండ-ంఢ ంత, ంథ, ంద, ంధ లమైత్రి :-

అనునాసికములు కాని చ,ట,త వర్గాక్షరములు బిందు పూర్వకములైనచో పరస్పరము యతి మైత్రి చెల్లును. దీనిని అనుస్వార సంబంధ యతి యందు చెప్పదగును. ఇట్టిమైత్రి చెల్లిన ప్రయోగములు పూర్వకావ్యములందు మృగ్యములు. అర్వాచీన కావ్యమగు సౌందర నందము నందు "ంచ-ండ" లకు యతిమైత్రి చెల్లిన ప్రయోగమొకటి కనబడు చున్నది.

శా॥ తండ్రీ! నాకన్నను నీకటం చనునయించెన్
జేర్మిదై వారఁగన్
(ఉపదేశము-34)

ఈ మూడు విధములగు మైత్రులవలన అప్పకవీయమున చెప్పబడిన "ట, త" వర్గముల మైత్రులతో పాటు చ వర్గమునకును మైత్రి యధికముగా చెప్పినట్లగుచున్నది. అందలి సరసయతియందు "ణ న" లతో పాటు "ఞ" కారమును; అనునాసికాక్షర, అనుస్వార సంబంధ యతులందు "ట, త" వర్గములతో పాటు "చ" వర్గమును జోడించి చెప్పిన, యెడల లక్షణము యొక్క ప్రయోజన పరిధి యధికమగుటతో పాటు లక్షణ రచనమునకు సంక్షేపము కూడ సిద్ధించును.




# శ్రీ శ్రీ కవిత్వం

రచయిత. డాక్టర్ మిరియాల రామకృష్ణ
పుస్తకం ఖరీదు 60 రూపాయలు
ప్రాప్తిస్థానం: శ్రీమతి లక్ష్మీదేవి
10-4-23 కాకినాడ 4

తెలుగు భాషలో సృజనాత్మకమైన ఉత్తమ సాహిత్యం చాలా ఎక్కువగా వెలువడింది. బహుజనాదరణ గూడా పొందింది. కాని హిందీవంటి ఇతర భారతీయ భాషలతో పోల్చి చూస్తే తెలుగులో వెలువడిన విమర్శనా సాహిత్యం చాలా తక్కువ అని చెప్పక తప్పదు. కారణ మేమిటో తెలియదు, తెలుగులో ప్రచురించ బడిన విమర్శన గ్రంథాలు చాలా తక్కువ. అయితే ప్రాచీన సాహిత్యానికి సంబంధించిన విమర్శన గ్రంథాలు తెలుగులో లేక పోలేదు. ఉన్నవి. తరచు చాలా వ్యాసాలు గూడా పత్రికల్లో వెలువడుతూనే వున్నవి. కాని ఆ గ్రంథాలూ, ఆ వ్యాసాలూ సంప్రదాయ పద్ధతిలోనే ఎక్కువగా కన్పిస్తున్నవి. ఆధునిక దృక్పథాన్ని అనుసరించి వ్రాసినవి మరీ తక్కువ. తెలుగులో ఆధునిక సాహిత్యం చాలా ప్రచారంలోకి వచ్చింది. అనేకమంది కవులూ, నవలా రచయితలూ, కథానికా నిర్మాతలూ పుంఖానుపుంఖంగా రచనల్ని వెలువరిస్తున్నారు. కాని పాఠకులకు ఆ రచనల్ని గురించి సరియైన అవగాహన ఏర్పడాలన్నా రచయిత తన రచనలో చూపించిన విశేషరచనా ప్రక్రియల్ని అర్థం చేసుకొవాలన్నా విమర్శన చాలా అవసరమనే విషయం నిర్వివాదమైనది. ఆంధ్ర కవితా రంగంలో శ్రీ విశ్వనాథ సత్యనారాయణ, దేవులపల్లి కృష్ణశాస్త్రిగార్లు మహోజ్వలనక్షత్రాలుగా ప్రకాశించారు. శ్రీ శ్రీ నవయుగ కర్తగా ఉజ్వంతారగా ఇప్పటికీ తెలుగు సాహిత్యరంగంలోకి తన కాంతుల్ని వెదజిమ్ముతూనే ఉన్నారు. అట్టి శ్రీశ్రీని గురించి గానీ, విశ్వనాథ దేవులపల్లి గార్లను గురించిగానీ తదితర తెలుగు ఆధునిక మహాకవులను గురించి గానీ తెలుగులో సద్విమర్శనలు ఇంతవరకు పెద్ద ఎత్తున వెలువడక పోవడం దురదృష్టకరమైన విషయం. ఇట్టి స్థితిలో డాక్టర్ మిరియాల రామకృష్ణ గారు శ్రీ శ్రీ కవిత్వమనే గ్రంథాన్ని వెలువరించారు. ఈ గ్రంథం కొత్త ఆశనూ, కొత్త విశ్వాసాన్నీ కలిగిస్తున్నది. శ్రీ. సి. నారాయణ రెడ్డి గారివంటి వారు కొన్ని గ్రంథాలను వ్రాసి ప్రచురించినా తెలుగులో రావలసిన విమర్శనా సాహిత్యం చాలా వుందనడంలో అతిశయోక్తిలేదు. శ్రీ రామకృష్ణగారు శ్రీ శ్రీ కవిత్వం, అనే పుస్తకంలో శ్రీశ్రీ కవిత్వంలో క్రమంగా వచ్చిన వికాసాన్ని కన్నులకు కట్టేటట్లుగా వివరించారు. మొత్తం గ్రంథాన్ని వివిధ శీర్షికలలో వేర్వేరు అధ్యాయాలుగా విభజించారు. ప్రతి అధ్యాయానికీ ముందు ఆ అధ్యాయంలోని కవితా స్వభావాన్ని వివరించే శ్రీ శ్రీ కవితను సంక్షేపంగా పొందుపరిచారు. ఆధునిక తెలుగు కవితా రంగంలో ఉద్దండులైన కవులు మొదట మొదట

ఉత్తమ కావ్యసృష్టి చేయడం తరవాత తరవాత వారి రచనల్లో, వారి వాటిలో మొదటి వున్న చైతన్యం కనిపించక పోవడం మనం తరచు చూస్తున్నాము. కొంతకాలం ఉగ్రతా భూతంగా భావించే కవితాసృష్టిని వారు చేసినా తరువాత తమ రచనల్లో మొదటి శక్తిని ప్రదర్శించలేక పోవడం గూడా అందరికీ తెలిసిన విషయమే. అందుకు ఉదాహరణగా చాలామంది ప్రసిద్ధ కవుల రచనల్ని మనం చూపించ వచ్చును. కాని శ్రీ శ్రీ ఈ నాటికీ అవుట్‌గాని వికెట్‌లాగా నిలబడి వుండడం తెలుగు వారి అదృష్టమని నా అభిప్రాయం. ప్రబంధ ఫక్కీలో శ్రీ శ్రీ గారు తన రచనల్ని ప్రారంభించారు. ఆ రూపంమారి భావ కవిత్వం వచ్చిన నాడు కృష్ణశాస్త్రి గారితో సరి సమానంగా రచనల్ని చేశారు. ఆ తరువాత అభ్యుదయ కవితా యుగానికి ప్రతినిధిత్వం వహించారు. ప్రస్తుతం అరసంలో నుంచి విరసంలో చేరి జీవంతమైన కవితా సృష్టిని చేస్తున్నారు. యుగంతో బాటు ఎదగడం, మారిన భావాలకూ, సాహిత్య ప్రవృత్తులకూ ప్రాతినిధ్యం వహించడం శ్రీ శ్రీ గారి ప్రత్యేకత. మిరియాల వారు ఆ మార్పుల్నీ, కాలక్రమేణా శ్రీ శ్రీ కవితలో వచ్చిన యుగధర్మాభివ్యక్తినీ ఈ ఉద్గ్రంథంలో వివరించారు. ఇట్టికృషి ఇతర తెలుగు కవులను గురించి గూడా జరిగితే తెలుగు సాహితీమతల్లికి ఎంతో సేవ చేసినట్లు అవుతుంది. శ్రీ రామకృష్ణ గారు చేసిన కృషి ఎంతో అభినందించదగినది.

-ఆంజనేయశర్మ

## మరో జంఘాల శాస్త్రి

(ఉపన్యాస వ్యాస సంకలనం)

రచన—అయ్యలసోమయాజుల నాగేశ్వరరావు

వెల రూ. 3-00

ప్రచురణ-యువభారతి, 6, కింగ్స్‌వే సికింద్రాబాదు-3

ఐదారు దశాబ్దాల క్రితం పానుగంటి లక్ష్మీ నరసింహారావుగారు వ్రాసిన సాక్షి ఉపన్యాసాలను గురించి తెలియని తెలుగు పాఠకులుండరని చెప్పడం అతిశయోక్తికాదు. సాక్షి ఉపన్యాసాలు ఆనాడు ఆంధ్ర పత్రిక (దిన)లో ప్రకటింపబడి తరువాత ఆరు భాగాలుగా పుస్తక రూపంలో ప్రచురించబడి తెలుగు సాహితీ జగత్తును మిక్కిలి ప్రభావితం చేశాయి. సాక్షి ఉపన్యాసాలు ఆనాటి సాంఘిక దుస్థితిని చక్కగా వెల్లడించడమే కాక దుస్థితికి కారణాలైన చర్యలను ఖండించడం జరిగింది. ఈ 'మరో జంఘాలశాస్త్రి' ఉపన్యాసాలు నేటి సమాజంలో పెచ్చు పెరుగుతున్న అన్యాయాలనూ, అక్రమాలనూ ఎత్తిచూపుతున్నాయి.

రచయిత శ్రీ నాగేశ్వరరావు సాక్షి సంపుటాలను పలుసార్లు పఠించి, ఆ ఒరవడిలో వీటిని రచించారు. ఈ పుస్తకంలో "జంటనగరాల సిటీ బస్సులు" "తెలుగు చదువ చిత్రములు" "తుఫాను కవితల పోటీ" "మహిళా మహాసభ" "కవుల సామాజిక స్పృహ" "మినీకవుల-విమర్శ" మొదలైన పన్నెండు ఉపన్యాసవ్యాసాలు ఉన్నాయి. వ్యాసాలు చాలా వరకు వ్యంగ్యభంగిమలో హాస్య ధోరణిలో నడచినవి. ఈనాటి సామాజిక స్థితిగతులను చక్కగా వెల్లడిస్తున్నవి. భాష సరళ గ్రాంథికంలో సాగింది. రచయిత శైలికి ఉదాహరణ - చూడండి

"కార్యాలయములోనూ, ఇండ్లలోనూ మనము కూరుచుండి కాళ్ళు గుంట్లు పట్టుననియు, అట్టి వారు పరుగెత్తుట ఆరోగ్యకరమనియు ఎరిగిన మన రవాణా సంస్థవారు ప్రజారోగ్యమే భాగ్యముగా తలచి బస్సులను నిలువవలసిన స్థలమునకు ముందుగనో వెనుకనో నిలువబెట్టి ప్రజలను పరిగెత్తించి వారి కాయురారోగ్యములు కూర్చుచున్నారు."

—వేముగంటి

# రేఖలు

(కవితా సంకలనం)

ప్రచురణ-యువభారతి, సాహితీ సాంస్కృతిక సంస్థ-5, కింగ్స్‌వే సికింద్రాబాదు-3

యువభారతి వివిధ సాహిత్య ప్రక్రియల ప్రచురణకై బహుముఖీనంగా చేస్తున్న కృషిలో భాగంగా కవుల కవితా సంకలనాలను ప్రచురించడమొకటి. ప్రతి ఉగాదికి ఒక కవితా సంకలనాన్ని ప్రకటించడం ఆనవాయితీగా పెట్టుకొన్న యువభారతి దుందుభి ఉగాదికి ఈ కవితా సంకలనాన్ని ప్రచురించింది. ఈ సంకలనంలో పదునాల్గురు కవుల కవితలు సమకూర్చబడినాయి. ఈ సంపుటిలోని కవులు చాలా వరకు తమ కవితల ద్వారా ఆంధ్ర సాహితీ లోకానికి పరిచితులే.

ఈ సంకలనంలోని కవితలన్నీ గొప్పవి కాక పోయినా చాలా కవితలు కవితాత్మకలవై కమనీయ రీతిలో ఉన్నాయనడంలో సందేహించ నక్కరలేదు. కవుల భావనాశక్తిని ప్రకటించే కొన్ని కవితలైనా ఉదహరించడం సమీక్షకుని కర్తవ్యం. అందువల్ల కొన్ని కవితా పంక్తులను ఉదాహరిస్తున్నాను. ఆవకాశం చేతులు సాచి ఆర్ద్రంగా పిలిచిననాడు.

"విత్తులా ఉన్న వాణ్ణి
వృక్షంలా ఎదగలేనా ?
దివిటీలా ఉన్న వాణ్ణి
దివాకరుణ్ణి కాలేనా ?

అంటు ఆకాంక్షిస్తూ చక్కని కవిత చెప్పినారు ఇరివెంటి కృష్ణమూర్తిగారు. ఈ పంక్తులు కవి ప్రతిభకు గీటు రాళ్ళు.

"మనసు పండిన వేళ
మూగ నోమేను
మమత పండిన వేళ
మూగ బాసేను"

అంటూ కె. వి. కామేశ్వరరావుగారు చెప్పిన ఈ కవితా పంక్తులు భావగర్భితంగా ఉన్నాయి. గోళ్ళ కుమార స్వామిగారు "చదువు కంటె సంస్కారం గొప్పది/పదవికంటె హృదయం గొప్పది/పదవి క్షరం/హృదయం అక్షరం" అంటూ యథార్థాన్ని చక్కగా వెల్లడించారు. అయ్యదేవర పురుషోత్తమ రావుగారు తెలుగు జాతీయాలతో" లోకం"అనే కమ్మని కవిత రచించారు. నాగినేని భాస్కరరావుగారు "నేడు-రేపు" "పగిలిన నెత్తురు" అనే కవితలు నేటి సామాజిక పరిస్థితులకు అద్దం పడుతున్నాయి. ఈ కవి "బక్కచిక్కిన ప్రతిపక్షాలు, తెల్లబడుతున్న ఎర్ర జెండాలు" అని చమత్కారంగా చెప్పారు.

"సూర్యునిలో వేడిపోతే అతడు చీకటి, చంద్రునిలో వెలుగు పోతే అతడు చీకటి, నదుల్లో నీరు పోతే అవీ చీకటి, ప్రేమలేని నాడు మనిషి బ్రతుకు చీకటి" అంటూ తిరుమల శ్రీనివాసాచార్యులు గారు ప్రతి మనిషీ తోటివాణ్ణి ప్రేమించాలని ప్రబోధిస్తున్నారు. "అగ్నిలా, తియ్యగానే మొదలైంది, ఏకాంత బాధాతిమిరాల్ని దహించిలది, కానీ చిత్రం, ఎదకు సెగనంటించి, ఇంకా చిచ్చులానే అనిపిస్తోంది" అంటూ సుధామగారు వలపువైచిత్రిని చిత్రంగా చిత్రించారు. ఈ కవి చెప్పిన "బుర్ర" "గురికోసం" అనే కవితలు గమ్మత్తుగా వ్యంగ్యరీతిలో సాగినవి.

ఈ 'రేఖలు' అరుణరేఖల్లా మెరుస్తూ జనతను ప్రభావితం చేస్తున్నాయి.

—వేముగంటి

అకాడమీలు ప్రచురించవలసిన తెలుగుకావ్యం

# 'మనుచరిత్ర'

(హిందీ అనువాదం)

11వ శతాబ్దం నుండి తెలుగు భాషలో కావ్య రచన సాగింది. అల్లసాని పెద్దన 16వ శతాబ్దారంభంలో మనుచరిత్ర వ్రాశాడు. దాదాపు 24 సంవత్సరాల క్రితము చలపతిరావుగారు ఈ కావ్యాన్ని 'తిరుమలేశుని ఆస్థానంలో' అనువదించడం ప్రారంభించి, తీవ్రంగా కృషిచేసి పూర్తి చేసినా పుస్తకంగా వెలుగు చూడటానికి భగీరథ ప్రయత్నం చేయవలసి వచ్చింది. ఎందరో వ్యక్తులు పూనుకొని వ్యయప్రయాసలకు గురిఅయి, ప్రసవ వేదన పడితేనే తప్ప పాతికేళ్లకైనా 2?5 పేజీల 'మనుచరిత్ర' 'జాతీయభాష'లో వెలువడ లేదంటే మనం ఎంత వేగంగా అభివృద్ధి పథంలో సాగుతున్నామో చెప్పకనే చెపుతున్నది జాతీయ స్థాయిలో పనిచేస్తున్న అకాడమీలు, రాష్ట్రస్థాయి అకాడమీలు, పుస్తకాలు ప్రచురించి గోడౌన్లలో ఎలుకల పాలు చేస్తున్న జాతీయ ప్రచురణ సంస్థలు, ఆంగ్ల సాహిత్యంలో కా క ర కా య ల ప్రసక్తి,విశ్వరూప దర్శనం అనబడే వెయ్యి పేజీల రిసెర్చి గ్రంథాలను టన్నులకొద్ది ప్రచురించి పేజీకి రూపాయి చొప్పున ధర పెట్టి తలాకొంత శాతం ముట్టచెప్పి లైబ్రరీల బీరువాలను నింపివేస్తున్న ప్రచురణకర్తలు పచ్చగా ఉన్నంత కాలం ఈ కథ ఇంతే!

'మనుచరిత్ర'తర్వాత ఆదేసరళిలో వసుచరిత్ర కళాపూర్ణోదయం, ఆముక్తమాల్యద, పాండురంగ మహాత్మం మొదలైన కావ్యాలు వెలువడిన కారణంగా పెద్దన్నకు తెలుగు సాహిత్యంలో ప్రత్యేక స్థానం లభించింది.

సంస్కృతంలో రఘువంశం, కుమారసంభవం కిరాతార్జునీయం, శిశుపాలవధ, నైషధ కావ్యాలను పంచమహాకావ్యాలునుగా పైన చెప్పిన అయిదు తెలుగు కావ్యాలను ప్రబంధ పంచమి అని పేర్కొనడం జరిగింది.

"ప్రప్రథమంగా సర్వలక్షణ సమన్వితంగా వెలువడిన తెలుగు ప్రబంధం మనుచరిత్ర"

హిందీ సాహిత్య రసజ్ఞులు జయశంకర్ ప్రసాద్ కావ్యం 'కామాయని' తో మనుచరిత్రను పోల్చిచూచే ప్రయత్నం చేయడం సహజం. 'కామాయని'లో వైవస్వతమనువు కథ ఉండగా పెద్దన్న 'మనుచరిత్ర'లో స్వారోచిష మనువు కథ ఎన్నుకోవడం జరిగింది. కామాయనిలో కామాతురుడైన మనువుకు ఇడ గుణపాఠం నేర్పగా 'మనుచరిత్ర'లో సౌందర్యోపాసకురాలైన వరూథిని ప్రేమను ప్రవరుడు తిరస్కరిస్తాడు. వైవస్వత మనువు పుత్రుడైన మానవుని శాంతి యాత్రతో 'కామాయని' ముగియగా, వరూథిని మనుమడైన స్వారోచిషుని తపస్సుతో 'మనుచరిత్ర ముదుస్తుంది.

"మనుచరిత్ర" 'కామాయని కావ్యాల రచనా కాలంలో దాదాపు 4 శతాబ్దాల అంతరం ఉంది. చలపతిరావు గారి హిందీ అనువాదం వల్ల పాఠకులు 4 శతాబ్దాలు వెనక్కు ప్రయాణం చేసినా 'కామాయని' లోని కోమలత్వాన్ని కూడా చవి చూస్తారు. కనుకనే ఇలపావులూరి పాండురంగా రావు గారన్నట్లు 'చలపతి రావు గారి ఈ అనువాదం హిందీ-తెలుగు భాషల మధ్య సాంస్కృతిక సేతువు

ప్రవరసిద్ధుల సంభాషణ, వరూథినీ ప్రవరుల సంభాషణలు ఈ కావ్యానికి ఆయువుపట్టువులు. హృదయాన్ని తాకే పెద్దన కావ్యమాధుర్యంతో బాటు హిందీ అనువాదంలో వేదాంత ప్రసక్తి సందర్భంలో చలపతిరావు మేధస్సును కూడా పాఠకుడు దర్శిస్తాడు.

గార్హస్త్య జీవన నిష్ఠాగరిష్ఠుడైన ప్రవరుడు, సాత్వికరూపసౌందర్యోపాసకురాలైన వరూథిని- వీరిద్దరి సంభాషణలో కామ–వాసనలను సమర్థిస్తూ ఆనంద బ్రహ్మ ప్రసక్తి, ప్రవరుడు ఉపనిషత్తుకు సరియైన వ్యాఖ్యానాన్ని విశదీకరించడం జరుగుతుంది. తైత్తిరీయ ఉపనిషత్తులోని బహ్మానందవల్లి విశదీకరణ సంభాషణ రూపంలో జరుగుతుంది "ఆనంద" స్వరూప నిర్ణయమే ఈ కావ్యం యొక్క "సందేశం" అని చెప్పవచ్చు.

కామాయని, సాకేత్, రామచరిత్ మానస్ మొదలైన కావ్యాల శైలీ రూపాలు ఈ కావ్యాన్ని చదువుతున్నపుడు పాఠకుని మనసులో మెదులుతాయి

బ్రహ్మానందవల్లిలోని అష్టమ అనువాకంలో ఆనంద మీమాంస ప్రారంభిస్తూ ఇలా చెప్పడం జరిగింది.

యువా స్యాత్సాధుయువాధ్యాపక ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠస్తస్యేయమ్ పృథివీ సర్వా విత్తస్య పూర్ణాస్యాత్. స ఏకో మానుష ఆనన్దః.

కనుకనే ఇటువంటి మహాకావ్యాల్ని అచ్చు వేసే విషయంలో కొన్ని మౌలికమైన విషయాల్ని పాటించాలి. ఈ గ్రంథంలో 9 రకాల తెల్ల కాగితాన్ని వాడవలసి వచ్చింది. ముఖచిత్రం కావ్య గౌరవాన్ని కాపాడే విధంగా లేదు. (ముఖ చిత్రం గురించి అనువాదకులు ప్రత్యేక సూచన కూడా చేయవలసిన అవసరం కలిగింది. పాపం ప్రవరుడు !)

ప్రింటింగు బాగాలేదు. అనువాదకుని కవి హృదయాన్ని అర్థం చేసుకొన్న ప్రింటరు స్వయం గానే కవి కాబట్టి, జాగరూకతతో వ్యవహరించినా పుస్తకం ఈ విధంగా రూపొందించడంచే పుస్తక ముద్రణ విషయంలో మనం ఏ శతాబ్దంలో ఉన్నామో తెలుస్తుంది. తప్పుల్ని కలంతో దిద్ది గీతా ప్రెస్‌వారిని గుర్తు చేశారు ప్రకాశకులు. మలిముద్రణ (అంటూ జరిగితే) ఈ లోపాల్ని సరిదిద్ది 'కథావస్తువు'కు దగ్గ ఆకారాన్ని రూపకల్పన చేస్తారని ఆశిద్దాము.

ఉత్తర భారతంలో ఈ పుస్తకాన్ని కొనిపించ డానికి కావలసిన 'లక్షణాలు' ప్రకాశకులకున్నట్లు తోచడంలేదు. దక్షిణ భారతంలోనైనా హిందీసాహిత్య రసజ్ఞులు, విద్యార్థులు చదవవలసిన కావ్యం;

—వి. ఎస్. హరినారాయణ్

స్వారోచిష-మను-సంభవ ప్రవర్

మూలం; అల్లసాని పెద్దన

హిందీ అనువాదం; వద్దిపర్తి చలపతిరావు 'శ్రీవత్స'

పబ్లిషర్స్; భారత్ భారతీ ప్రకాశన్

హనుమాన్‌వీధి, పున్నమతోట,

విజయవాడ-520 010

క్రౌను సైజు-224 పేజీలు

వెల; 12 రూపాయలు.




# కృష్ణాజిల్లా రచయితల 5వ మహాసభలు

లలిత కళలకు నెలవై సాహిత్యస్రష్టలకు ద్రష్టలను సృష్టించిన దివి సీమకు నడిబొడ్డైన అవనిగడ్డలో వెలసిన సమాజసేవాక్షేత్రం గాంధీక్షేత్రంలో కృష్ణా జిల్లా తెలుగు రచయితల అయిదవ మహాసభలు జులై 10, 11 తేదీలలో దివిసీమ సాహితీసమితి అధ్వర్యంలో విజయవంతంగా జరిగాయి.

10వ తేదీ ఉదయం పదిగంటలకు మహాసభలు 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' ప్రార్థనా గీతంతో ఉత్సాహపూరిత వాతావరణంలో ప్రారంభమైనాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవి డాక్టర్ దాశరధి కృష్ణమాచార్యులు సభలను ప్రారంభిస్తూ "సంఘం శిశువు వంటిది. రచయిత సంఘానికి మాతృమూర్తి అని పేర్కొన్నారు. శిశువు ఆరోగ్యంగా ఉండాలంటే ఆరోగ్యకరమైన తల్లిపాలు అవసరమైనట్లే సమాజ ఆరోగ్యానికి మంచిరచనలు కావాలన్నారు. సమాజాన్ని ఛిన్నాభిన్నంచేసే రచనలకు రచయితలు పూనుకోకూడదని హితవు చెప్పారు. రాజకీయంగా ఎవరి అభిప్రాయాలు వారివి. అయినా సమాజ శ్రేయస్సే అందరి ధ్యేయం కావాలి. సమాజ పురోగతికి తోడ్పడే రచనలు చేయాలని శ్రీదాశరథి విజ్ఞప్తి చేశారు. భాషను గురించి ప్రస్తావిస్తూ భాష ప్రజలపై ఆధారపడింది. కాని పండితులపై కాదని, కార్మికులు, కర్షకులు, మాట్లాడేవి సిసలైన భాష అన్నారు. రచయితల ఆర్థిక దుస్థితిని ఆసరాగా తీసుకొని పబ్లిషర్లు బాగుపడుతున్నారని అందుచేత రచయితల సహకార సంఘం ఏర్పాటు చేసుకొని పుస్తక ప్రచురణకు పూనుకోవాలని శ్రీ దాశరధి సూచించారు.

మహాసభల కార్యదర్శి శ్రీ బి. శ్యామ్‌సుందర్ ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకట్రామ్ మహాసభలు విజయవంతం కావాలని కాంక్షిస్తూ పంపిన సందేశాన్ని చదివి వినిపించారు.

ఈ సందర్భంగా ప్రచురించిన ప్రత్యేక సంచికను శ్రీ ముక్కామల నాగభూషణం ఆవిష్కరించారు.

సభకు అధ్యక్షత వహించిన సుప్రసిద్ధకళా విమర్శకులు శ్రీసంజీవదేవ్ తమ ప్రసంగంలో సామాజిక శ్రేయస్సు-రసానందం-ఈ రెండినీ రచయిత దృష్టిలో ఉంచుకోవాలని అన్నారు. లలిత కళలలో సాహితీకళ ఉత్తమమైనది. సంస్కారం లేకపోతే రాజకీయ సాంఘికాది రంగాలు కలుషితమవుతాయి. సమాజంలో సంస్కారం పెంచే విధంగా రచనలు రావాలని ఆయన కోరారు.

ఈ కార్యక్రమంలో ముఖ్యఅతిథిగ పాల్గొన్న కెనడా దేశ సమాజసేవకుడు శ్రీ రోజర్ కీన్ వచ్చీరాని కమ్మని తెనుగులో ప్రసంగించి సభికులను ఆనందపరిచారు

తొలుత ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ మండలి వెంకట కృష్ణారావు స్వాగతం చెప్పుతూ దినిసీమ విశిష్ఠతను, గాంధీక్షేత్ర సేవాకార్యక్రమాలను వివరించారు. సమాజ శ్రేయస్సుకు ఉపకరించే రచనలు చేయాలని ఆయన రచయితలను కోరారు.

సారథ్యసంఘం అధ్యక్షులు శ్రీగుత్తికొండ సుబ్బారావు వందన సమర్పణతో ప్రారంభ సభ ముగిసింది.

## సంప్రదాయ సాహిత్య సదస్సు

మధ్యాహ్నం 12 గం॥కు కవిసమ్రాట్ శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి అధ్యక్షతన సంప్రదాయ సాహిత్య సదస్సు జరిగింది. రక్తనిష్ఠమైన సంప్రదాయ సాహిత్యం సుస్థిరంగ వుంటుందని, ఎన్నిరకాల రచనలు వచ్చినా ఇది నిలుస్తుందని శ్రీ పైడిపాటి అన్నారు.

ముఖ్య అతిథిగ విచ్చేసిన శ్రీ కోట సుందర రామ శర్మ తమ ప్రసంగంలో "ప్రపంచంలోని ఇతర సాహిత్యములలో వలెనే తెలుగులో కూడా అదికాలం నుండి అధునిక యుగంవరకు సంప్రదాయ కవిత్వం అవిచ్ఛిన్నంగ సాగుతునే ఉందనీ, వినేవారూ, చదివేవారూ ఉండడమే సంప్రదాయ సాహిత్యం జీవించి ఉన్నదనడానికి నిదర్శనమనిఅన్నారు.

## బాలసాహిత్య సదస్సు

సాయంత్రం 5 గంటలకు బాలసాహిత్య సదస్సు బాలబంధు శ్రీ బి. వి. నరసింగరావుగారి అధ్యక్షతన జరిగింది. ముఖ్య అతిథిగ ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ కార్యదర్శి శ్రీ బుద్ధిగ సుబ్బరామన్ విచ్చేసి తమ అకాడమీ ద్వారా బాలసాహిత్యాభివృద్ధికి జరుగుతున్న కృషిని వివరించారు.

బాలసాహిత్యం - కథలు - నాటికలు - గురించి శ్రీ సోమంచి రామం, శ్రీమతి డి సుజాతాదేవి బాల సాహిత్య ఆవశ్యకత గురించి, శ్రీమతి వాసిరెడ్డి కాశీరత్నం, బాలనేరస్థులు-రచయితల బాధ్యతపై సోదాహ

## మినీకథా సమ్మేళనం

రాత్రి 7-30 గం॥ కు ప్రసిద్ధ రచయిత్రి శ్రీమతి తెన్నేటి హేమలత అధ్యక్షతన మినీకథా సమ్మేళనం జరిగింది. శ్రీమతి లత తమ ప్రసంగంలో కథాసాహిత్యం అనాదికాలంనుండి వుందని, శాతవాహనులకాలంలో వెలువడ్డ శాలివాహన గాథాసప్తశతి అందుకు నిదర్శనమని పేర్కొంటూ ఇది నవలల కాలమని, కథారచయిత బ్రతకడం కష్టంగా వుందని, ప్రచురణ కర్తలు కథాసంకలనాలు ప్రచురించడానికి ముందుకురావడం లేదని, రచయిత స్వయంగ ప్రచురించుకునే స్థితిలో లేరని ప్రస్తుత పరిస్థితులలో కథానికకు భవిష్యత్తు వున్నదా? అని తాను సందేహపడుతున్నానని శ్రీమతి లత అన్నారు.

డాక్టర్ పోతుకూచి వెంకటేశ్వర్లు, శ్రీమతి పక్కలంక పద్మావతి, శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల,శ్రీ మల్లాది సూరిబాబు, శ్రీ వి. పి కుసలరావు, శ్రీ ఎమ్. ఎ. మూర్తి, కథానికలను చదివి వినిపించారు. శ్రీమతి కె. వసుంధరాదేవి మినీకథా స్వరూపాన్ని సోదాహరణంగ వివరించారు.

## కవితా సదస్సు

11వ తేదీ 9 గంటలకు కవితా సదస్సుతో రెండవ రోజు కార్యక్రమాలు ప్రారంభమైనాయి. శ్రీ డా॥ త్రిపురనేని వెంకటేశ్వరరావు సదస్సుకు అధ్యక్షతవహిస్తూ ఉదాత్త భావాలుకల కవి ఉదాత్త కవిత్వం వ్రాస్తాడని, కవిత్వం సభ్యతా సంప్రదాయాల నుంచి పరిణామం చెందుతూ వచ్చిందని తెలిపారు.

'కవిత్వం నిబద్ధత-అనుభూతి' అనే అంశంపై ప్రసంగిస్తూ శ్రీ అద్దేపల్లి రామమోహనరావు, అనుభూతి లేని నిబద్ధత చదివించదని, నిబద్ధతలేని అనుభూతి సమాజానికి ఉపయోగపడ' దన్నారు.

శ్రీ జి. ఎల్. కాంతారావు ఆధునిక కవితోద్య మాలను గురించి వివరించారు. కళాత్మకమైన విలువ లేని రచన సినాదంగ మిగిలిపోతుందని, ఆధునికత కాలవాది కాదు, గుణవాది అని అన్నారు.

శ్రీ మైత్రేయ నాటక రచనా పరిణామ క్రమం గురించి సోదాహరణంగ ప్రసంగించారు. శ్రీ రావి రంగారావు మినీకవిత గురించి, శ్రీమతి కె నిర్మలం ఈ తరం కవులపై శ్రీ శ్రీ ప్రభావం గురించి ప్రసంగించారు.

ముఖ్యఅతిథిగా విచ్చేసిన డాక్టర్ మిరియాల రామకృష్ణ శ్రీశ్రీ కవిత్వంపై తాము జరిపిన పరిశోధన విశేషాలను వివరించారు.

## తిరుపతి వెంకట కవుల సాహితీ సేవ

ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారాల శాఖ, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి సంయుక్తంగ నిర్వ హించిన "తిరుపతి వెంకట కవుల సాహిత్య సేవపై" సదస్సు ఈ సభలలో ఏర్పాటు చేయుట ఆనందించ దగిన విషయం. మాజీ మంత్రి శ్రీ మండలి వెంకట కృష్ణారావు ముఖ్యఅతిథిగ విచ్చేసిన ఈ సదస్సుకు త్రివేణి పత్రికా సంపాదకులు శ్రీ భావరాజు నరసింహ రావు అధ్యక్షత వహించారు. డా॥ జంధ్యాల మహతీ శంకర్ తిరుపతి వెంకటకవుల అవధాన చాతురి గురించి, డా॥ జి.వి. సుబ్రహ్మణ్యం నాటకసాహిత్యం గురించి అనర్గళంగ ఉపన్యసించి తిరుపతి వెంకట కవుల సాహితీ సేవను సభికుల ముందుంచి, వారిని అలరించారు.

## రూపక, కథా, నవలా సదస్సు

సాయంత్రం 6 గంటలకు శ్రీ కర్నాటక లక్ష్మి నరసయ్య అధ్యక్షతన రూపక, కథా, నవలా సదస్సు జరిగింది. శ్రీ పోతుకూచి సాంబశివరావు ముఖ్యఅతిథిగా విచ్చేశారు. ప్రతీక నాటకరచన గురించి శ్రీ పురాణ పండ రంగనాథ్, తెలుగు కథలో నూతన ప్రయో గాలపై శ్రీ విహారి, తెలుగు నవలలలో సామాజిక ప్రయోజనంపై డా॥ రామమోహనరావు, నాట్యావధాన ప్రక్రియపై శ్రీ స్వర్ణరాజ హనుమంతరావు ప్రసంగిం చారు.

## కృష్ణాజిల్లా రచయితల సంఘం

కృష్ణాజిల్లా రచయితల సంఘం ఏర్పాటు చేయటం ఈ సభల వల్ల కలిగిన ఫలితంగా పేర్కొన వచ్చు. శ్రీ ముక్కామల నాగభూషణం అధ్యక్షతన, డా॥ తెన్నేటి హేమలత, డా॥ త్రిపురనేని వెంకటేశ్వర రావులు ఉపాధ్యక్షులుగ శ్రీ గుత్తికొండ సుబ్బారావు ప్రధాన కార్యదర్శిగా తాత్కాలిక కార్యవర్గంఏర్పడింది. జిల్లా రచయితల సభలు జరుపుట, పుస్తక ప్రచురణ ఈ సంఘ ముఖ్యోద్దేశ్యం.

## కవి సమ్మేళనం

రెండు రోజులపాటు జరిగిన మహాసభలు సాయంత్రం 7 గంటలకు ప్రసిద్ధ కవి శ్రీ ఆరుద్ర అధ్యక్షతన జరిగిన కవి సమ్మేళనంతో ముగిశాయి. 26గురు కవులు పాల్గొన్నారు.

# పట్టణ హిందీ ప్రేమీ మండలి, గుంటూరు
## ప్రమాణ పత్ర వితరణోత్సవము, పట్టణ హిందీ ప్రచారకుల సమావేశము

ది. 6-6-82వ తేది ఉదయం శ్రీ మాజేటి గురవయ్య హైస్కూలు ఆవరణలో పట్టణ హిందీ ప్రచారకుల సమావేశం జరిగింది. ఈ సమావేశ మునకు దక్షిణ భారత హిందీ ప్రచార సభ (ఆంధ్ర) కార్యదర్శి శ్రీ చిర్రావూరి సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షత వహించిరి. ముఖ్య అతిథిగా శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు (అధ్యక్షులు ఆంధ్రప్రదేశ్ హిందీ ప్రచారక మండలి) ఈ సమావేశములో పాల్గొనిరి.

మండలి కార్యదర్శి శ్రీ చింతలపూడి కుసుమ హరనాథశర్మగారు స్వాగతము పలుకుతూ, ఈ సమావేశ లక్ష్యములను గూర్చి వక్కాణించి, సభకు పరిచయము చేసిరి. మండలి అధ్యక్షులు శ్రీ గుడివాడ పుల్లారావుగారు "ఇట్టి సమావేశములవలన సభ-ప్రచారకుల మధ్య మిక్కిలి సన్నిహిత భావము ఏర్పడుననియు అట్టి సన్నిహిత భావము పెంపొందుటకై యిట్టి సమావేశములు మండలి తరపున ఏర్పాటు చేసినామని," వివరించారు.

సభాధ్యక్షులు శ్రీ చిర్రావూరి సుబ్రహ్మణ్యం గారు తమ ఉపన్యాసములో గుంటూరు పట్టణము ఆంధ్రప్రదేశ్‌లో అగ్రగామి అనియు. హిందీ అధ్యయనము చేసి, పరీక్షలకు కూర్చునే విద్యార్థులసంఖ్య అన్ని జిల్లాలకంటే గుంటూరు జిల్లాలో ఎక్కువ అనియు, పట్టణములో జరుగుతున్న హిందీ ప్రచారమునకు మిక్కిలి సంతసించుచున్నామనియు, యీ కృషి అంతయు ప్రేమీమండలి కార్యకర్తలు,మరియు హిందీ ప్రచారకుల సమిష్టి కృషి అనియు వక్కాణించిరి. దక్షిణ భారత హిందీ ప్రచార సభ, హిందీ ప్రచార ఉద్యమమునకై చేయుచున్న కృషిని వివరిస్తూ, ఇటీవల పాఠశాలలలో హిందీ బోధనకు తగ్గించిన పిరియడ్సును యథాతథముగా ఉంచుటకు ప్రభుత్వము వారితో మాట్లాడినామనియు, గౌరవనీయులైన విద్యాశాఖామాత్యులు శ్రీ కేశవరావుగారు మన కోర్కెను సానుభూతితో పరిశీలించి పీరియడ్సును తగ్గించకుండా వుండునట్లు జి.ఓ. పంపుతానని అన్నారనియు" వెల్లడించిరి.

ముఖ్య అతిథి శ్రీ బోయపాటి నాగేశ్వరరావు గారు ప్రచారకుల లక్ష్యమును గూర్చి వివరిస్తూ యిట్టి పవిత్రమైన హిందీ ప్రచారములో అందరూ భాగస్వాములే అనియు, అట్టి ప్రచారమును దీక్షతో చేయవలెనని " ఉద్ఘాటించిరి.

తదనంతరము ప్రచారకులగోష్ఠి జరిగినది. శ్రీ చాపలి కోటేశ్వరరావుగారు. శ్రీ ఎమ్. వెంకటరత్నం, శ్రీ బి. అంజయ్య, శ్రీ పి. సుబ్బారావు. శ్రీ డి.లింగేశ్వరరావు, శ్రీ పి. ఉమాకాంతంగార్లు తదితర ప్రచారకులు యీ గోష్ఠిలో పాల్గొని హిందీ ప్రచార ఉద్యమములో ఎదురగుచున్న సమస్యలనుగూర్చి చర్చించిరి.

శ్రీ డి. లింగేశ్వరరావుగారి ధన్యవాదములతో ప్రచారకుల సమావేశము ముగిసినది.

### ప్రమాణపత్ర వితరణోత్సవం

సాయంకాలము ప్రమాణపత్ర వితరణోత్సవము జరిగినది.

మండలి కార్యదర్శి శ్రీ చింతలపూడి కుసుమ హరనాథశర్మ గారు ముఖ్య అతిథులను పరిచయము చేస్తూ,స్వాగతము పలికిరి. విశారద విద్యాలయ విద్యార్థిని చిరంజీవి వేమూరి నిర్మల ప్రార్థనతో సభా కార్యక్రమము ప్రారంభమైనది. మండలికార్యదర్శి తమనివేదికలో మండలి కార్యకలాపాలనుగూర్చి వివరిస్తూ ఈ విశారద విద్యాలయమును ప్రవీణ మహా విద్యాలయముగా అప్ గ్రేడ్ చేయమనియు, కేంద్ర ప్రభుత్వము

వారి స్కీము ననుసరించి "ప్రవీణ విద్యాలయము - టంకణ విద్యాలయము" రెండింటిని మంజూరు చేయ మని ద. భా. హిందీ ప్రచార సభ కార్యదర్శిగారిని ప్రార్థించిరి. సభ అధ్యక్షులు తమ ప్రసంగంలో ప్రేమీ మండలి స్వంతభవనమునకై ప్రయత్నము చేయు చున్నామనియు రాష్ట్రభాష-రాజభాష అగు హిందీ నేర్చుకొనవలసిన ఆవశ్యకతను గూర్చి వక్కాణించిరి. ప్రేమీ మండలి వారి సంప్రదాయము ప్రకారము పట్ట ణములోని ప్రముఖ హిందీ ప్రచారకులు, విశారద విద్యాలయము ప్రిన్సిపాల్ శ్రీ చావలి కోటీశ్వర రావు, యమ్. ఎ. గారిని, ఆంధ్ర కార్యదర్శి శ్రీ సుబ్ర హ్మణ్యం గారిని చందన, తాంబూల ఫలాదులతో మండలి అధ్యక్షులు కార్యదర్శులు సన్మానము చేసిరి. శ్రీ చావలి కోటీశ్వరరావు గారు తనకు జరిగిన సన్మాన మునకు కృతజ్ఞతలు తెలియచేస్తూ, తన జీవిత మంతయు, మహాత్మాగాంధీ గారి చేత నెలకొల్పబడిన స్వదేశీ ఉద్యమము, హిందీ ప్రచార ఉద్యమము, గ్రంథాలయ ఉద్యమానికి అంకితమయినదని వివరించిరి.

ఆంధ్రసభ కార్యదర్శి శ్రీ సుబ్రహ్మణ్యంగారు తమ ఉపన్యాసములో "ఈ పట్టణములో నిరుద్యోగులయిన, పట్టభద్రులయిన యువకులు నిరాశ చెందకుండా, హిందీ ప్రచార ఉద్యమమును చేపట్టి తద్వారా స్వావ లంబనము మీద ఆధారపడుటకు పనిచేయుచున్న వారి కృషిని శ్లాఘిస్తూ, యిట్టి యువశక్తియే సభకు కావలె ననియు, యిది శుభసూచకమనిరి. గుంటూరులో జరు గుచున్న హిందీ భాషోద్యమాభివృద్ధిని గూర్చి ప్రేమీ మండలి కార్య కలాపాలను కొనియాడుతూ, యింకను యితోధిక సేవ చేయగలరని తమ అకాంక్షను తెలియజేసిరి.

శ్రీబోయపాటి నాగేశ్వరరావు గారు "పరీక్షలలో ఉత్తీర్ణులయిన విద్యార్థులకు ఆశీస్సులు, హితబోధ చేస్తూ, యిట్టి చిరుతరుణములోనే హిందీ అధ్యయనము చేయుట మీ అదృష్టము, మీరందరు భవిష్యత్తులో మిక్కిలి అభివృద్ధి చెందగలరు" అని ఆశీర్వదించిరి.

తదనంతరము 1981 అగష్టు పరీక్షలలో ఉత్తీ ర్ణులయిన సుమారు 1600 మంది విద్యార్థులకు యోగ్యతా పత్రవితరణ జరిగింది. అనేక మంది విద్యా ర్థినీ, విద్యార్థులు, ఆంధ్రకార్యదర్శి శ్రీసుబ్రహ్మణ్యం గారి కరకమలములతో యోగ్యతా పత్రములను తీసు కొని, వారి ఆశీస్సులు పొందిరి. శ్రీ పరిమి సుబ్బా రావు గారు వందన సమర్పణ జేసిరి.

'జనగణమనతో కార్యక్రమము దిగ్విజయముగా ముగిసింది.

## హిందీ ప్రేమీ మండలి, రాజమహేంద్రవరం

11-7-82 సా॥ 5 గం॥కు రాజమహేంద్రవరం, హిందీ ప్రేమీ మండలి అధ్వర్యమున విక్రమ హాలులో ప్రమాణ పత్ర వితరణోత్సవము జరిగినది. సభకు రెడ్‌క్రాస్ సంస్థ కార్యదర్శి శ్రీ పోతాప్రగడ సూర్య నారాయణ అధ్యక్షత వహించారు. ముఖ్యఅతిథిగా పంచాయతీ ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు శ్రీ పడాల రామ కృష్ణారెడ్డి ఎం. ఏ; పాల్గొన్నారు.

అధ్యక్షులు శ్రీ పోతాప్రగడ సూర్యనారాయణ మాట్లాడుతూ "దక్షిణ దేశంలో హిందీ ఎడల వ్యతి రేకత లేదని, తమిళనాడులో కూడా పాఠశాలలలో హిందీ బోధన లేక పోయినా, సభ ద్వారా, ప్రభుత్వం ద్వారా జరపబడుచూవున్న హిందీ పరీక్షలలో కూర్చొని ఉత్తీర్ణులగుచూ వున్నారని మంచి ప్రగతిని సాధిస్తూన్నారని అంటూ, ప్రభుత్వం హిందీకి తగిన ప్రోత్సాహం ఇవ్వకపోవుటవలన ప్రజలలో నిరుత్సాహం కలుగుచూవున్నదని, హిందీభాష జాతీయభాషగా అభివృద్ధి పొందుటకు ప్రభుత్వం కొన్ని ప్రణాళికలు నిర్మించి, స్వచ్ఛందముగా అమలు పరచాలని" కోరిరి.

ముఖ్య అతిథి శ్రీ పడాల రామకృష్ణారెడ్డి "విదేశాలకు మనదేశీయులు వెళ్లుతూ వున్నపుడు మన వారు ఇంగ్లీషులో పరస్పరం మాట్లాడుకొనుట చూచి "ఇండియాలో జాతీయ భాష లేదా ?" అని విదేశీయులు ప్రశ్నిస్తూవున్నారని, ఈ వికృత సంస్కృతి మనదేశానికి అప్రతిష్ఠగా ఉన్నదని అంటూ సంస్కృత భాషలో వుండే మాధుర్యాన్ని అన్ని ప్రాంతీయ భాషలు స్వీకరించి, మెరుగులు దిద్దుకుంటూ వుంటే హిందీ కూడా జాతీయ భాషగా పరిపుష్టిగా అలంకరించు కుంటుందని, హిందీ ప్రేమీ మండలి విద్యాలయ విద్యార్థులు హిందీ పరీక్షలలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులవ్వాలని ఆశీర్వదించారు.

హిందీ ప్రేమీమండలి అధ్యక్షులు డా॥ మండవిల్లి మల్లికార్జునరావు శ్రీ జోశ్యుల సూర్యనారాయణ "హిందీ ప్రచారములో వున్న లోట్లు ప్రసారమునకు కావలసిన విధానాలపై మాట్లాడిరి.

అష్టావధాని శ్రీ బులుసు వెంకట రామమూర్తి "దేశానికి హిందీ నేర్చుకొనుట అవసరమని,తనభారత దేశ పర్యటనలో హిందీ భాషా ప్రభావం తొంభై శాతం వుందని, అందుకని గాంధీజీ హిందీని జాతీయ భాషగా ప్రచారం చేసారని" అన్నారు. అనంతరం శ్రీ పోతా ప్రగడ సూర్యనారాయణ విద్యార్థులకు ప్రమాణ పత్రములు అందచేసారు.

పరీక్షలలో సర్వ ప్రథములుగా ఉత్తీర్ణులైన వారికి శ్రీ జోశ్యుల సూర్యనారాయణగారు కొంత సొమ్ము బహుమానంగా యిచ్చారు.

సభలో వీరేశలింగం ఇంగ్లీషు స్కూలు హిందీ ఉపాధ్యాయులు శ్రీ షేక్ మౌలానా తన స్వీయ కవితలు ''లవకుశ్"ని కవితా గానం చేసారు; అలాగే హిందీ మహా విద్యాలయ ప్రిన్సిపాల్ కుమారి సుబ్బలక్ష్మి తన స్వీయ కవిత ''ఆజాదీ"ని గానం చేసారు.

తొలత ప్రేమీ మండలి కార్యదర్శి శ్రీ మెరపల సన్యాసిరావు స్వాగతం పలికారు. చి॥ తవ్వల సుధ, రజనీ ప్రార్థన చేసారు. సభానంతరం చి॥ కాకినాడ వీరపార్వతి వీణా నాదమును విపించి సభ్యులను ఆనందింప చేసిరి.

## హిందీ ప్రమాణ పత్ర వితరణోత్సవము

### పామిడి

స్థానిక ప్రభుత్వ జూనియర్ కళాశాలయందు తే. 18-7-82న దక్షిణ భారత హిందీ ప్రచారసభ, ఆంధ్ర హైదరాబాద్‌వారి హిందీ పరీక్షల ప్రమాణ పత్ర వితరణోత్సవము జరిగినది.

బి. భవానీ, చి. అరుణలచేత గావింపబడిన ప్రార్థనానంతరము హిందీ ప్రచారకులు శ్రీ ఎ. బి. ఉమాశంకర్ అతిథులకు స్వాగతము పలుకుచూ సభా ప్రత్యేకతను వివరించిరి.

సభకు అధ్యక్షత వహించిన శ్రీ యస్. తేజప్ప (హెడ్మాష్టర్, పరిషత్ హైస్కూల్ పెద్ద వడుకూరు) గారు మాట్లాడుతూ, యిలాంటి ఉత్సవములను జరుపుటలోగల ప్రధానలక్ష్యమును వివరించుచూ, జాతీయ భాషా విశిష్ఠతను తెలిపిరి. వారే ఉత్తీర్ణులైన విద్యార్థులకు ప్రమాణ పత్రములను ఒసంగిరి.

ముఖ్య అతిథులైన శ్రీ వి.యస్.ఆర్. కృష్ణారావుగార్లు మాట్లాడుచూ, విద్యార్థి దశలోనే యెక్కువ భాషల నభ్యసించవలెనని, జాతీయ భాషను నేర్చుకొనుటవలన మనము దేశ సమైక్యతకు తోడ్పడగలమని హితోపదేశము చేసిరి.

హిందీ ప్రచారకులు వందనసమర్పణతర్వాత జాతీయగీతముతో సభ ముగిసెను.

## ప్రమాణ పత్ర వితరణోత్సవము హిందీ ప్రేమీ మండలి చిట్యాల

పశ్చిమ గోదావరి జిల్లా చిట్యాల జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో 16-4-62 తేదీ సాయంకాలము 4 గం॥లకు మూడవ హిందీ ప్రమాణ పత్ర వితరణోత్సవము వైభవంగా నిర్వహించబడెను. శ్రీమతి సి. సెచ్. చిట్టెమ్మగారి ప్రార్థనతో సభ ప్రారంభమయ్యెను. సభకు స్థానిక హైస్కూలు ప్రధానోపాధ్యాయులు శ్రీ సి.బి.కె. అవధాని M.A M.Edగారు అధ్యక్షత వహించిరి. 1961 ఆగస్టు నెలలో జరుపబడిన ప్రారంభిక పరీక్షలలో ఉత్తీర్ణులైన పరీక్షార్థులకు స్థానిక గ్రామ సర్పంచ్ శ్రీ కె. వెంకట్రావుగారు ప్రమాణ పత్రములను సమర్పించిరి. హిందీ ఉపాధ్యాయులు శ్రీ షేక్ జమాల్ వీలి మరియు హిందీ ఉపాధ్యాయురాలు శ్రీమతి వి. వి. రాజ్యలక్ష్మి హిందీ ప్రాముఖ్యతను గూర్చియు, దాని ప్రచారమును గూర్చియు ప్రసంగించిరి. జాతీయ గీతముతో సభ ముగిసినది.

## కరీంనగర్‌లో హిందీ ప్రేమీమండలి ఎన్నికలు

ఇటీవల (ఏప్రియల్ 25న) కరీంనగర్ హిందీ ప్రేమీమండలి సర్వసభ్య సమావేశం మండలి అధ్యక్షులు శ్రీ బోయినపల్లి వెంకట రామారావు అధ్యక్షతన జరిగినది. మండలి కార్యదర్శి శ్రీ సందెపూడి సత్యనారాయణ 1962 సం॥ బడ్జెటు అంచనాలను ప్రవేశ పెట్టగా ఆమోదించబడెను.

ఇటీవల దివంగతులైన దక్షిణ భారత హిందీ ప్రచార సభ-ఆంధ్ర మాజీ కార్యదర్శులు శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, శ్రీ చంద్రభట్ల అప్పన్నశాస్త్రి గారలకు శ్రద్ధాంజలి ఘటించబడెను. కరీంనగరంలో హిందీ విశారద విద్యాలయం స్థాపించినందులకు దక్షిణ భారత హిందీ ప్రచారసభ-ఆంధ్రకు కృతజ్ఞత ప్రకటించబడెను.

తదనంతరం జరిగిన ఎన్నికలలో నూతన కార్యవర్గ సమితికి శ్రీ బి. వేంకటరామారావు అధ్యక్షులుగాను, శ్రీ పి. సుబ్బరాయశాస్త్రి, శ్రీ సజ్జన సత్యనారాయణరావులు ఉపాధ్యక్షులుగాను, శ్రీ వి. రామేశం కోశాధికారిగాను, శ్రీ సందెపూడి సత్యనారాయణ కార్యదర్శిగాను, శ్రీ కె. చంద్రమోహనరావు, శ్రీ డి. లాజయ్యలు సంయుక్త కార్యదర్శులుగాను, కార్యవర్గ సభ్యులుగా సర్వశ్రీ యం. జగన్నాథం పి. కేదారలింగం, కుమ్మరి లింగయ్య, యన్. విజయకుమారి, గ్రంథి రాజేశ్వరమ్మ, సి. జగన్‌రావు, నిమ్మగడ్డ నాగేశ్వరరావు, కె. రాజలింగం గారలను ఏకగ్రీవముగా ఎన్నుకొనబడిరి.

# ఉచ్చ శిక్షా ఔర్ శోధ్ సంస్థాన్

## హిందీ స్నాతకోత్తర కాంప్లెక్స్, హైదరాబాద్.

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ

ఎమ్. ఏ/రాష్ట్రభాషా పారంగత్ పరీక్షా ఫలితాలు.

క్రమసంఖ్య

200, 201, 202. ప్రథమశ్రేణి

2, 103, 104. ద్వితీయశ్రేణి

పాఠ్యక్రమ సంఖ్య : 1

103, 205, 207, 211, 212, 213, 214, 215, 217, 218, 219.

పాఠ్యక్రమ సంఖ్య : 3

104.

పాఠ్యక్రమ సంఖ్య : 6

103, 104, 205, 206, 207, 211, 213, 215, 217, 218.

పాఠ్యక్రమ సంఖ్య : 11 (క్రొత్త)

205, 206, 207, 211, 212, 213, 214, 215, 217.

పాఠ్యక్రమ సంఖ్య : 13 (క్రొత్త)

2, 200. 201, 202, 2 5, 211, 212, 213, 214, 215, 218.

పాఠ్యక్రమ సంఖ్య : 4

2, 200, 201, 202.

పాఠ్యక్రమ సంఖ్య : 11 (పాత)

2, 103, 200, 201. 202.

పాఠ్యక్రమ సంఖ్య : 14 (క్రొత్త)

2, 200, 201, 202.

పాఠ్యక్రమ సంఖ్య : 15 (క్రొత్త)

2, 200, 201, 202.

పాఠ్యక్రమ సంఖ్య : 13 (పాత)

104.

పాఠ్యక్రమ సంఖ్య 14 : (పాత)

104.

పాఠ్యక్రమ సంఖ్య : 15 (పాత)

104, 200.

పాఠ్యక్రమ సంఖ్య : 18

104.

పాఠ్యక్రమ సంఖ్య : 8

200.

## ఎమ్. ఫిల్/పూర్వ సాహిత్యాచార్య

క్రమసంఖ్య : 4

( వే. ఆంజనేయశర్మ )

కులసచివ్

తి. 22-7-1982





ది 16-8-1969న హైదరాబాదు రాష్ట్రపతి నిలయంలో దక్షిణ భారత హిందీ ప్రచార సభ మద్రాసు కార్యవర్గ సమావేశం జరిగిన సందర్భంలో తీయబడిన చిత్రం పూజ్యులు సభాధ్యక్షులు శ్రీ రాజేంద్రప్రసాద్‌గారి అధ్యక్షతన జరిగిన ఆ సమావేశంలోనే సభకు జాతీయ ప్రతిపత్తిని ప్రసాదించమని కేంద్ర ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానించబడింది. దక్షిణ భారత హిందీ ప్రచార సభ చరిత్రలో ఇది ఒక మహత్తరమైన సమావేశం ఆ తీర్మానం ప్రాతిపదికగా సభకు జాతీయ ప్రతిపత్తి ప్రసాదించబడింది.

Edited, Printed and Published by Ch. Subrahmanyam, on behalf of the D. B. Hindi Prachar Sabha-Andhra, 959, Khairatabad, Hyderabad-500 004.
and Printed at Dakshina Bharat Press. Hyderabad-500 004.